శ్రీ సోమేశ్వరాయ నమః.



# భ[illegible]మంజరి.

సింహాద్రి వెంకటాచార్యులచే
రచియింపబడి



శ్రీ భారతీవిలాస ముద్రాక్షరశాల
యందుముద్రింపించి ప్రచురింపఁబడియె.

మొదటికూర్పు.

నర్సారావుపేట.

దీని వెల రు0-4-6.

1911.

# ఉపోద్ఘాతము

——:(౦):——

ఈగ్రంథకర్త శ్రీవైష్ణవుఁడు [illegible]వాచార్యుల [illegible]ఁడు తిరుమలాచార్యుల పుత్రుఁడు గౌతమగోత్రుఁడు "భద్రాచలస్వామి రామచంద్రుఁ డోనర నాడెందమున నిండియుండుఁ గాత." అని భద్రాచలస్వామి నిష్టదైవతముగా స్తుతియించి యుండుటచేత గోదావరిమండలములోని వాఁడై యుండవచ్చును. ఈయన తనగ్రంథమును వైష్ణవమతోద్ధారకుఁడైన రామానుజాచార్యున కంకితము చేసెను. అప్పకవికిఁ బూర్వకులైన లాక్షణికులెవ్వరు నీయన గ్రంథమును బేర్కొనకపోవుటవలన నీయన 1630-40 సంవత్సరప్రాంతములయందుండెనని యూహింపఁదగి యున్నది. అక్కడక్కడఁ గొన్ని వ్యాకరణ దోషములున్నను నీయన కవిత్వము ప్రౌఢముగా మాత్రమున్నది. ఈగ్రంథమును గందుకూరు వీరేశలింగము పంతులుగారు చింతామణీ ముద్రాక్షరశాలలో 1900 సంవత్సరమందు ముద్రింపించి యుండిరి. కాని యది నేఁ జూచియుండనిహేతువుచే మరలఁ బ్రకటించుట తటస్థమయ్యె. మా పత్రిక ప్రథమ సంపుటము ముగిసి ద్వితీయసంపుటమునఁ బ్రౌఢగ్రంథము లెవ్వియైనఁ బ్రచురించు తలంపుతోనుండ మాగ్రామమందలి పప్పుసీతారామశాస్త్రి మహాపూర్వికులు వ్రాసియుంచిన యీచమత్కారమంజరి తాళపత్రములపైనుండ నాకొసంగెను. ఆప్రతి తప్పుల తడకగా నుండుటచే నెంతగా సంస్కరించినను దప్పులు పడకమానవయ్యె. ఇదియు సంగారక మాసమునకు ఘారమో యుపకారమో పత్రికలోఁ బ్రచురింపఁ బడుచుఁ దడవకొకరు ప్రూఫ్లు చూచుచుండుటచేతమతికొన్ని

స్ఖాలిత్యములు పడుటకుఁ గారణమయ్యె. గ్రంథము పూర్తియగు సమయమునకు ముద్రితప్రతి దొరికి దాని నాధారము చేసికొని తప్పొప్పులపట్టి కుదిర్చితి. ముఖ్యములైనవి సవరింపఁబడినను సామాన్యములైన వనేకములుండియున్నవి. పరుష సరళములు యథాస్థానమున లేకుండుటయు మున్నగు వ్యాకరణ దోషములు పెక్కులున్నను గ్రంథ విస్తరభీతిచే నవియన్నియు వదలి యర్థగ్రహణమునకు బాధ లేకుండునంతవఱకు సవరించితిఁ గానఁ జదువరులు మన్నింతురుగాత.

ఇట్లు,

జానపాటి పట్టాభిరామశాస్త్రి.



# చమత్కారమంజరి.



శా॥ శ్రీరామాధిపభాగ్యవస్తుకలనాసిద్ధప్రదీపంబు సం
సారాంభోనిధిగాధసేతు వురుమోక్షశ్రీమృగాక్షీవశీ
కారాద్యౌషధ మాగమక్షితిజశాఖాచిత్ర మై యొప్పు మా
శ్రీరామానుజదివ్యశాసనము వర్ధిల్లుం దిగంతంబులన్ 1

ఉ॥ శ్రీమహితాత్మహస్తసరసీజగతంబగు వెన్నచే మనః
కోమలరీతి జేతనులకుం దగఁ జూపి రటత్కటీతటీ
సీమ సువర్ణఘంటికలచేఁ బ్రకటంబుగఁ జాటునట్టి నా
స్వామిని బాలకృష్ణుఁ గడుఁ జక్కని ముద్దులతండ్రిఁ గొల్చెదన్॥ 2

సీ॥ మున్న హల్యాగౌతములకుఁ బెండ్లి ఘటించి పిదప నజ్జానకిఁ బెండ్లియాడి
మున్నె యాశబరి కింపుగ విందుఁ గావించి చారువన్యఫలంబు లారగించి
మున్నె విభీషణుముదమొప్ప లంక నేలించి యయోధ్యఁ బాలించిమించి
మున్నె రావణునింటనున్న వేలుపుటాండ్ర జడలు విప్పించి తా జడలు విప్పి
యిట్లు తనుఁ గొల్చువారల కెల్లమిగుల నాదరంబున బహుమాన మాచరించు
రాజు భద్రాచలస్వామి రామచంద్రుఁ డానర నాడెందమున నిండియుండుఁ గాత॥ 3

శా॥ శ్రీరామానుజభాగినేయుఁడయి తచ్ఛ్రీభాష్యసింహాసనం
బారూఢిం గృపచే లభించుఘనుఁ డాయుం బాదువంశంబు వి
స్తారంబొంద జనించినట్టి వరదాచార్యాత్మజాతు న్విశా
దూరీ వేంకటదేశికున్ సుగుణపాథోధిం బ్రశంసించెదన్॥ 4

శా॥ సారాహారసహోదరాచ్ఛనిజవాచాచాతురిన్ సంతతా

పారప్రీతివహించియున్ సుకవు లల్పస్వల్పసూ మద్వచ
స్సారస్యంబును జిత్తగింపుదు రజస్రసస్వచ్ఛసంపూర్ణవాః
పూరంబైనసముద్రుఁ డొల్లఁడె మదస్ఫూర్తిన్ నదీనీరముల్॥ 5

తే॥ పలుకులయొప్పున మృదుపదవర్ణరీతిఁ గలితగీతుల నుత్తేభగతుల భావ
వచనమధురిభూషణరుచుల నాదు కవిత యలరించు రసికుల గలికిబోలె 6

చ॥ రసికుఁడుగాని యర్థమధురంబగుకావ్యగభీరభూరివా
గ్వసర మెఱుంగనేరఁ డవివేకి యొకానొకకారణంబునన్
పసఁజని రాజగేహమున విగ్రహపంజరకీరిఁ జూచి తా
పిసనెలతగ్గుదూడయని పిల్చునుగొల్లఁడు జాతిభాషతోన్ 7

ఉ॥ ఖ్యాతిగనవ్యభక్తిమగునర్థముఁ గ్రక్కొనునాకవీంద్రులన్
జాతురిమీరనిట్టనుచు సన్నుతు లేనొనరింతు వారు క
ట్టా తెలియంగబుద్ధిని బిడాలసమానగుణాఢ్యు లెంచ వి
శ్వాతులితస్వభావు లరయంగ సదా సవిశేషవృత్తులన్॥ 8

సీ॥ మిన్నుఁదన్నెడుపాలమున్నీటితరఁగలే తూఁగుటుయ్యేలలుగా నూఁగువాఁడు
గిరిఁ బరిఁజేసి యాశరధి బంధించి సంధిలు సుధారసము సాధించువాఁడు
చెంచుబైదువసమర్పించుఫలంబులు మించువేడుక నారగించువాఁడు
గద్దరియై పసిగాపుపెద్దలయిండ్లఁగలుగుక్రొవ్వెన్న ముచ్చిలినవాఁడు
గొనబుచిటిగొల్లెతలమోవిఁగ్రోలువాఁడు చేరిరసికతమీరఁగఁ జిత్తగించు
నభినవాకల్పభావనానల్పరుచిర మచ్చమత్కారమంజరీమధురిమములు 9

వ॥ ఇవ్విధంబున నిష్టదేవతావందనాదికావ్యముఖప్రసంగంబు సాంగంబుగా నొనరించి 10

క॥ అత్యంతకృష్ణబ్రహ్మక టాక్షోదితరసికపరిషదావృతిసం
ధుక్షితనవనవకవనా దక్షుండ సింహాద్రివెంకటాఖ్యాకుండన్॥ 11

మ॥ పవజాక్షాంబుదజాయమానకరుణావర్షంబులంబుట్టు చే
తనసస్యాలికి దృష్టికుండలయి యాత్మఖ్యాతిసందోహముల్
దనర న్శోభురముంచమెక్కి చరమార్థవ్యాప్తియ న్నేక నే
చినకృట్పాత్రులవోలు మాయతిపతిన్ సేవించెదన్ వెండియున్ 12

ఉ॥ నంబెరుమాళ్ళచిత్తమొకనాఁడు ప్రసన్నతఁ జేసి యాత్మపా
దాంబుజదాసదాసులకునందఱికిన్ ఘనమైనమోక్షసౌ
ఖ్యంబు లభించఁగా వరముఁ గాంచిన మా యతిచంద్రుఁ బోల లో
కంబులలోఁ గలండె యుపకారుఁ డటంచుఁ దలంచి వేడ్కతోన్. 13

కం॥ భూసురనిజపదకిసలయ దాసమనస్సన్నిహితత్రితాపవిమూలో
ద్వాసైకఫలకతాశం క్వాసన్నృశకరత్రిదండికాభరణునకున్ 14

కం॥ అక్షీణతటాకవినిర్గళ దక్షయనిష్కారణకదయాతటినీసం
ధుక్షితఫేనశ్లేషవ దృక్షవళశ్లోర్ధ్వపుండ్రదీప్తాస్యునకున్ 15

కం॥ దండప్రణమద్దాసా ఖండానందాశ్రుసలిలకణగణలీలా
ఖండితపదనఖరోచి స్మండలఖండితమన స్తమఃపటలునకున్

కం॥ ధృతిమతికి విబుధరచిత స్తుతితతికి నజన్యవాక్యచూడౌఘవ్యా
కృతిరతికి దుర్మ్రగమదావాతిక్షితికిని లక్ష్మణార్యుఁ డగు యతిపతికిన్ 17

వ॥ అంకితంబై కైంకర్యరూపంబుగా నారచియింపంబూనిన మహాప్రబంధంబునకుఁ గథా
క్రమం బెట్టిదనిన

ఉ॥ ద్వారకయన్ పురీవర ముదంచితకాంచనరత్నకీలిత
ద్వారకవాట మంశుకజవాతనిరుద్ధ నభశ్చరస్మరు
ద్వారకనధ్వజవ్రజ మధఃకృతసౌరపురీసురీతిభృ
ద్వారకలంకబింబ మధివార్నిధిఁ జొప్పడి యొప్పు నెప్పుడున్ 19

చం॥ తరమె నుతింపఁ బూనఁగను దత్పుటభేదనవాసిభాసి భూ
సురకులవర్యులెల్ల నతిచోద్యపవిత్రచరిత్రు లెట్లనన్
సారదిని జాతువేదులును సూరులు నయ్యు సహర్నిశంబుఁ దా
ల్చిరి జనలోకతోషకసుశీతలగోవిభవాభిరామ్యముల్ 20

చం॥ హరిపాకారి మహానసస్థుఁడనలుం డాసార్ద్రపే తేజుఁ డా

శరదూనాంబకశిష్యుఁడెంతయు సరస్వన్నాయకుండద్రిభుం
డగయన్వాయువునాగభుగ్నుఁడునగ్రైకావాసివిత్తేశుఁడా
హరుఁడుందాగురియౌ నెఖండపరశుండౌ నందుఁ దద్బాహుజుల్ 21

ఉ॥ వేలబడిన్ వణిగ్విపణివీధుల హాటకతారరాసు లా
భీలపతాకలన్ భిదురభృద్దురవస్థభజించి యాత్మతు
ల్యాలఘుసౌధవీధికలయందుల డాగెదునంకురత్ప్రత
త్రాళివిశత్సుమేరుగిరిశాద్రికిశోరములట్లు చెన్నగున్॥ 22

స్రగ్ధర

తమసంగీతప్రభేదోద్గతినవరుపరోదంబులాద్రెల్లి యేత
త్క్రమముక్ వృక్షేచరాలబ్ధములఁబడు ముక్తామణుల్ శూద్రపూర్ణం
దుముఖుల్ చేల్గాయుచుం బొందుగనొడిసెలలక్ రువ్వ శేషంబు తద్గీ
తమునన్నిరై కుదుళ్ళత్తఁగఁ బురిచెరుకుల్ తాము ముత్తెంబులీనుక్ 23

వ॥ మగుపత్తత్పురిహేమసౌధముల రిమ్యస్ఫీరలీలావిధా
నగతిన్ దారలసాలభంజికలకిన్వర్ధంబుగాఁ జుక్క బొ
ట్లుగఁబెట్టం బదనియ్యఁ బిండిరసముల్గొన్నన్ నిశాజానిత
గ్గుగనుండక్ హారణాంకుఁడయ్యె హరిణాంకుండఁద్రువర్ణభ్రమన్ 24

చ॥ కిళలకుదేరుగండములు గండము లాశశిఖండలక్ష్మిక
త్యలఘుతరాగసంపదలకావళు లావళులు త్పలచ్ఛదో
జ్వలతకుగోళ్లు గోళ్లు బిసవల్లిసముద్భవసౌకుమార్యకం
దళములకద్భుజల్ భుజలు తత్పురికన్నెలచెన్ను లెన్నఁగాక్ 25

న॥ హరిపురిసాలముంగెలిచి యాతతతజ్జయలక్ష్మిఁ బూనికన్
బరిణయమాడు నేననిశుభస్థితితోఁ బొడవేగునంత ని
ర్భరగతితోఁ జరించు ద్విజరాజుశశంబునుజూచి చూచితా
నరుఁగకయంతనిల్చినది యప్పురికోటపుకోటయంతయున్ 26

క॥ పురమునఁ దోఁటల్ మడుతే ర్పరచుచుఁ గొలనూలు గాఁగ బాటింతురు త
త్పరిసర పరిఘాంచలగత సరసీరుహనాళ మొకటి శక్యమె తలచన్॥

చ॥ లలిఁదగ నవ్పురింగలకొలంకులఁ గోకనదంబులొప్పఁ జ 27
ల్లలనలకన్నవల్ తెమవిలాసస్సమృద్ధికినోడి పృథ్విచేఁ
జలమరికన్నమూయనిరుపప్రకరంబులకుం బ్రసన్నవీ
క్షలదఁయు సేయు తామ్రముమయ స్థాననపత్రికలా నహోయనన్ 28

చ॥ అతులితతచ్ఛపిఃర్వన మయూరెఖలీయుఁ గీర స్థారికా
మితకలకంఠషట్పదసమృద్ధతనొప్పె గురుండుశాంబర
శృతలలితాస్త్రిముల్నిగుడ సారెనధోక్షజుఁ గెల్వఁబూని యా
తతముగఁ బెట్టు ముట్టడివిధంబునఁ దోఁచు పరీతసాలమై 29

క॥ ఉచ్చైశ్శ్రవమగుతనపై విచ్చలవిడి నెక్కరాతు వృద్ధశ్రవుఁడై
హెచ్చైనవేల్పు తేజిని గచ్చుకొని హసించు వీటఁగల్గుహయంబుల్ 30

సీ॥ వరకరంబుల సురవాహినిలోనున్న కుముదోరుపుండరీకములనొంచి
తతదీప్తి జితపుష్పదంతంబులైమీరి సాంజననిజవిగ్రహతఁ జెలంగి
వాసిమీరఁగ మహావామన సుప్రతీకస్ఫూర్తిమించి నిక్కముగ నెసఁగి
యభ్రమువరమూర్తినతిశయించుచు సార్వభౌమస్తుతంబులై పరిఢవిల్లి
యొందు మెండుగ శ్రీఖండమండితోరు గండమదగంధ బంధురకర్ణపవన
దత్తసురఘర్మజలశూన్యతాకథాప్రచారణములైన యప్వీటివారణములు॥ 31
సీ॥ బలుబూటకఁపుతల్లి ప్రాణంబులుగ్గుగా నెమ్మితోఁ జిటిబొజ్జనిండఁద్రావి
పసితహతహఁ బెట్టమున రెడు కార్చిచ్చుఁ గారంపుమందుగా నారగించి
వీచితన్నగ గొట్టు వెక్కసంబగునుడిగాలిరక్కసుమీదఁ లాలియూఁచి
కాళియుండను చల్లగాలి మేతలరేని ఘనశిరంబునఁ గుప్పిగంతులురికి
యొనరుగోవర్ధనంబను నొక్క కొండ। బంతిగా నాడి యిభ్భంగి బాలలీల
లక్కజంబుగ సలిపినయట్టిదిట్ట। దేవకీసూనుఁ డవ్పురతిలక మేలు॥ 32

సీ॥ అరయ నతులనవారిజాతోరుగర్వనివారకాస్యాభిరాముఁడితఁడు
వాసినెన్న సదావిలాసద్బృక్సరజాతవిజితానిమిషలోకవిభుఁడితండు
వరికింప భ్రూలతాభంగవిస్ఫూర్తి నిరస్తాతనుమహాశరాసుఁడితఁడు
కనఁగఁ దారకజిత్ప్రకాశసంపన్న ఖరప్రభావుండు పేర్పడఁగనితఁ

డనుచుఁ బండితు లభ్రాంతమును సుధానగోత్రచిత్రపవిత్రవాగ్గుంభనముల
నాత్మసౌందర్యశౌర్యంబు లభినుతింపఁదనరె యాదవకులధురంధరుఁడతండు॥ 33

కం॥ సరసిజ శశి శిశిర శర చ్ఛరద శరము లోడెఁ డిద్యశమునకు ధైర్య
స్ఫురణకు నవియేయోడెను హరనుతమగు తేజమునకు నవియేయోడెన్ 34

తే॥ చిత్రకూటప్రకారమై చెలఁగుకతనఁ బురము రామాభిరామమై పరగుచుండుఁ
జిత్రకూటప్రకారుఁడై చెలఁగుకతన హరియును రామాభిరాముఁడై యతిశయిల్లు॥ 35

వ॥ అంత

శా॥ నిద్రాళూకృతసౌధజాలకము తన్నీరోరుధారామిళ
ద్భద్రశ్రీపరిలేపనిందనము విస్ఫారోష్ట నాట్యక్రియా
ముద్రాదేశిక మంబుసంప్లవకధామూలప్రవాహంబు శుం
భద్రామాపటుమానభంజనము హేమంతంబు గానంబడెన్॥ 37

శా॥ శీతోపద్రవసంకటప్రభవ శోచిష్కేశమూలక్షయా
పాతాశంకఁగలంగి విశ్వనిలుపంబారంగ లోకంబు దా
భీతప్రక్రియఁగప్పిపోచుగతినొప్పెన్ ధూమరేఖోత్కరా
తీతాంగారకదంబపూరిత హసంతీన్యస్తహస్తాబ్జమై 38

చ॥ అల నిజభూరివారము లొయారముతో మధుపాళికిచ్చి యో
రల ద్విజరాజు మెల్లనెకరంబులు సాచిన మోముగందె యా
కులతఁ జెలంగుపద్మినులకున్ సిరులెంతయు దూరమయ్యె భూ
స్థలిని నపాత్రదాతలకు శాశ్వతమే రమణీయ సంపదల్ 39

చ॥ అరసి కొలంకులందు జలజావళిఁ గానక తద్గవేషణా
పరతఁ జరించుచున్ విపులపంకజకోరకసారశంకచేఁ
బరువడి నేగుదెంచిన ప్రభాకరు భానునికదంబకంబనా
గురుకుచసీమలందవుడు కుంకుమగంధ మలందిరంగనల్॥ 40

కం॥ చెలువగుజనహస్తంబుల వెలువడి యొకచోటఁ దాళవృంతములుండెన్
వలువగు నుడిగముఁ జేసిన యలయిక సుఖనిద్రలొందునందము మీరన్॥ 41

వ॥ అప్పుడు హరి హరిణాక్షులుందానును యథోచితక్రీడాలోలుండై యుండె మ
హోత్సవంబున

ఉ॥ అంతటఁ బండిపచ్చపసనైనదళంబులు రాలెఁ దద్వన
ప్రాంతములన్ ఫలంబిడుసమర్థతతో మధుమాసలక్ష్మిదా
నెంతయు వేడ్కరా నలమహీరుహదేవత పచ్చపట్టులన్
వింతలు గాఁ బదంబులకు వేగముతో నడఁగిచ్చు రంగునన్॥ 43

మ॥ చెలఁగ వారంగఁ బలాశభూజములు బూచెన్ మానవౌఘంబు త
త్కలికారాజికిఁ జిల్కముక్కుల కభిఖ్యాతారతస్యక్రమం
బులు చర్చింపుచుఁ జిల్కలెంతయునఁ దన్మూలంబు గాఁ బొంకమై
పొలుపొందెన్ ధరఁ గింశుకంబులనఁ దద్భూజంబులన్వర్థతన్॥ 44

తే॥ పత్రపుష్పఫలరససంపదలు వేడె ధరణి నమ్మాధవుఁడు ఘనతరుల నెల్లఁ
బత్రపుష్పఫలరససంపదలొసంగె ధరణి నమ్మాధవుఁడు ఘనతరుల కెల్ల॥ 45

తే॥ పరఁగ విటపాళిఁ గూడియు బహుపలాశ మయ్యు నెంతయుఁ బరకోశహారియయ్యు
భూజసంఘంబు సుమనోవిభుత్వమందె నహహ మాధవసేవ నిరర్థమగునె॥ 46

సీ॥ ఘనతరాగాప్తిఁ గని శారదాభిఖ్యనడరించు విమలగాత్రాళులకును
శ్రుతియోగ్యవాగ్వైఖరులఁ జెలంగు సుసరసవనప్రియద్విజసంఘమునకు
మెప్పైనవరసాలవృద్ధులతో సద్ధతిఁ దవిలి పల్కెడు నా శుకవితతులకు
మహితప్రవాలోకమంజులాస్యస్ఫూర్తిఁ గలయు వనాటులగణములకును
సందడిలు వేడుకబలు మారందవాహములు। తదాహారి భూరిసముజ్జ్వలప్ర
వాళము లభీష్టఫలములు నోలి నొసఁగ నా వసంతంబు రతిరాజుశ్రీవినెనఁగె। 47

కం॥ ఈరీతి వసంతము నిజ। చారుతరవిజృంభణములు సలుపఁగ మఱియుం
దారామసహోదరునకు। నారామవిహారవాంఛ యపుడుదయించెన్॥ 48

తే॥ మంజుమాకందమంజరీపుంజచర్వ। ణక్రియాకుంఠకలకంఠనాదసరణి
నాలకించిన మరుఁడంతరంగరంగ। వసుధ జెలరేగి పేరేలు వారికున్నె॥ 49

కం॥ నందకుమారుండపుడా। నందరసోద్వేలతరమనస్కుండగుచున్
బొందుగఁదన దేవేరుల। నందఱఁ జనుదెమ్మటంచు నానతియిచ్చెన్॥ 50

వ॥ అప్పుడు

సీ॥ పరమేష్ఠివాణియు సౌభాగ్యవర్ణాకృతి చొక్కమైనొప్పలఁ జేర్చుక్క బెళక
గబ్బిచన్గక్కవల్గరచిన సుకుమారబిసములు నా సరుల్ బిత్తరింపఁ
జిదరఁగాఁ జేరిన చిరినవ్వు జిగియు నా ముదనైన ముక్కరముత్తెమమరఁ

దను హేమవల్లికిఁ దాల్చిన నీలంపు సెలగోలనా వేణి చెల్వమీర
నొక్క కెంగేలఁ బాపడఁ జక్కనిడుచుఁ దనదు మంజీరఘలఘలధ్వనికిఁ దానె
ప్రతిపదంబును గడునుల్కిపడుచు నేగు దెంచె రుక్మిణియను సుదతీలలామ 51

కం॥ చొక్కఁపునడతోఁ దళుకుం । బుక్కాఘుమఘుమలుతట్టుపునుగుభుగల్ నల్
దిక్కులునిండఁగ నెంతయుఁ । జక్కని కాళిందియ నెజవ్వనివచ్చెన్॥ 52

చం॥ గమకఁపుటొరగొప్ప సిరిగందఁపుబొట్టును ముక్కుకమ్మిము
త్తెము మెడగంఠముం బయిడితీవలచీరెయు పీడెముక్ విలా
సముఁదులకించుకుందనఁపుసందిటితాయతు లొప్ప సత్యనా
నమరెడుప్రోవవచ్చె నరయక్ మెరయింపుచు గిల్కుమట్టియల్ 53

సీ॥ జారుగొప్పననున్నసంపెంగవిరులు లోఁగడసిన ఖద్యోతగణముఁబోల
నుదుటఁజన్నులబుటంబురుకునీలఁపుతాళి గిరులపై జలదాలికిరియనెనంగ
సన్నవల్లెము మేన జాళువాయనఁటి లేచిగురాకుపై మంచువగలనించఁ
గనకభూమ్రమధ్యస్థకస్తూరిరేఖ సింగిణిఘటించినకోల గేలిసేయఁ
జేతిచిల్కకుమాటలు చెప్పకొనుచు ఘల్లుఘల్లను నిజపాదుకారవమునఁ
గుంజరంబులఁ జప్పటల్ గొట్టునడల తోడ నేతెంచె భద్రాఖ్యతోయజాక్షి॥ 54

సీ॥ నీలంబులైన పెన్నెరులజొంపము నుచితముగా సువర్ణయుక్తముగఁజేసి
కంసారిచేపట్టుగల్గి ముక్తాఫలంబైన చన్గవఁ జంద్రమలరఁగూర్చి
యాలపుష్యరాగంబు లగుపాదనఖముల వరకర్బురార్తితో వరలనిల్పి
పద్మరాగంబులౌ పాదతలంబులఁ దగినకళ్యాణపత్రములఁబొదివి
జంభవిధ్వంసిమణిమయస్తంభజనిత తిమిర మీషద్వికసితచంద్రికఁదొరంగ
నప్పుడేతెంచె మిత్రవిందాఖ్య నీలవేణి లీలానమితశార్ఙ్గపాణియగుచు 55

తు॥ చెలువై జాంబవతీవధూటిచనుదెంచెన్ వేడ్కతోనప్పుడు
జ్వలమంజీరయుగంబు మంజుతరఘోషంబొప్ప గోపాలుఁడ
త్యలఘుప్రీతివహించకున్న గతభద్రశ్రీపదంబొట చే
నలకౌశేయము చక్రియున్నతనిజస్వాంతుండుగాకుండునే॥ 56

ఉ॥ ముక్కరముత్యమున్ మిగులమోహఁపుఁజుక్కనుగూడి వక్త్రమున్
రిక్కలరేడు గాంచిస్వవరించిన నామఁపుముద్దుకుర్రకున్
జొక్కఁపుబాహులన్ బసిడిసోగలఁగట్టినలాలిలీలతో
నక్కునవ్రేలుదాలి చెలువారగవచ్చె సుదంతియంతటన్॥ 57

కం॥ విజితాభ్రము లల కౌనులు విజితాభ్రము లల్ల కురులు వివరింపంగా
విజితాభ్రము లల నాభులు విజితాభ్రము లల్ల నడలు విమలాంగులకున్॥ 58

సీ॥ అలకీల్జడలెపోలుట దియె యూరులు రమణీయనాగోత్కరములఁ బోలు
నల యూరులెపోలుటరిదియె తన్నఖపాళియు శుభకరభములఁ బోలు
నల ఖంబులెపోలుటరిదియె కంఠసీమలు చూడఁ దారకంబులను బోలు
నల కంఠములెపోలుటరిదియె తనువల్లికలును గల్యాణపూగములఁ బోలు
నట్టితనువులెపోలు టేమరిది తలపఁ గలికిచూపులు చంచలాళులను బోలు
నట్టిచూపులెపోలు టేమరిది మోము లతనుశరజాతములఁ బోలు నద్భుతముగ 59

సీ॥ శ్రుత్యంతపరిచితిశోభిల్లె నేత్రంబు లాగమాభ్యాసతనమరెఁ గుచము
లనఘపురాణవాసనఁ జెందె మధ్యముల్ ఘనకల్పరీతులఁ గాంచెఁ గురులు
ధర్మశాస్త్రస్థితిఁ దనరె భ్రూదృష్టులు జ్యోతిషస్ఫూర్తితోనమరె నఖము
లమరఁ బాటలవర్ణమంకించె మోవులు కవితాపరిస్ఫూర్తిఁ గనియె నడక
లలమహామీనశయ్యాంకుఁడైన యట్టి హరి సదాగూఢపదభూషుఁడైన హరుఁడు
సూనపాకతఁ జెల్లఁగు వాగ్జాని యట్టి కమలనయనల వర్ణించఁగల రె తలప 60

వ॥ అట్టిమహిషీవర్గంబు పరిష్కృతపరిచారిణీపరివృతంబై పురోభాగంబున నిల్చిన

చ॥ బొమలెగవైచి కన్గవలఁ బొందుగఁ గన్గొని పేరు గ్రుచ్చి కొం
చెముగ హసించి యొక్కొ యొక సక్కెమటాడి యయారె నీకుఁ గం
దము కడు నందవాననిముదంబునఁ జెక్కిలిఁ గీటి యిట్లు నె
య్యమెసఁగఁ బల్కరించె హరికాంతలనందరనన్నిభంగులన్ 62

వ॥ అంతటఁ దత్సతీసహితుండై గృహారామాభిరామమార్గంబునం జనిచని 63

మ॥ సరసీజాక్షుఁడు గాంచెనంత నిఖిలాశాదత్తధూతప్రసూ
నరజశ్ఛిత్రితశాటికన్ నవఫలాంధఃప్రీణితోద్బుద్ధ హే
షరమానందనఘోటికన్ దరుశిఖాస్ఫాయద్ఘనేందిందిరో
త్కరదంభాంబుదదర్శనప్రమదనృత్యత్కేకినీనాటికన్
సరసాపాదితమారఘాటికను దచ్చంచద్వనీవాటికన్ 64

లయగ్రాహి

మాలములరంగువిటపాళుల బెడంగును బ్రవాళములరొప్పు ఛదజాలముల తీరున్

గ్రాలుపసక్రొమ్మొగడడాలు పువుగుత్తులపిసాళిబిగి కుప్పలుగరాలినరజం బా
వాలములునిండిబయలొలిఁజను తేనియల కాలువలఁదెప్పలుగఁదేలెడుఫలంబుల్
చాలనటుకాంచి యలబాలికలఁగూడి వనమాలియు నయారెయని సోలితలయూఁచెన్

వ॥ మరియు నిష్కుటంబయ్యును సకుటంబై శుకపికనికరంబుల కవనంబయిన వనంబునందు నసూనంబులయిన సూనంబులనుద్భవించి యనాశాస్యంబయ్యునాశాస్యంబయిన మధురసంబుఁగ్రోలి పరవశతావిర్భావంబులయ్యు నపరవశతా విర్భావంబులై మెదలకయున్న తుమ్మెదకదుపుల పజ్జకుంజని యఘనాభిఖ్యంబులయ్యు ఘనాభిఖ్యంబులయిన శౌరియంగంబుల యొప్పిదము రెప్పలిడక తప్పకచూచు వనలక్ష్మిచూపుల రూపులనొప్పె భళిరెయని సావధానంబుగాఁగనుచును గనకరంభాస్తంభంబులకు నేగి యంతంబులయ్యు ననంతంబులై నపత్రంబుల విలాసార్ధంబుగాదారుచును దారకకాంతిగల్గి ఖరంబులయ్యు నఖరశబ్దాభిధేయంబులై ననఖంబుల గండమండలస్వేదబిందుబృందంబులఁజిమ్మి వేసరిగంధవహాకందళంబులఁగోరుచును గోరకగణంబులు ప్రతిచ్ఛదమూలంబునుబిక్కటిలినమల్లికావల్లికామతల్లికలఁగాంచి వలక్షంబులయ్యు నవలక్షంబులయ్యెనౌరయక్కజపుఁజక్కఁదనమనుచును నవకవసతినున్నకతనవసుధాకమధురంబులయ్యు నవసుధాకమధురంబులైన కీరకలాపంబులయాలాపంబులుగానరయుచును నరయకగతి నవలంబించిసంచరించె నచ్చంచలనయనాసంఘంబు మరియును. 66

## రగడ

లలివిరులకుబోరెడుతరెఁ గుచలోలతలంజిక్కుచు లతలంజిక్కుచు
వలిగొనుపూదేనియజేరుకున జవమ్ములుదిక్కుచు వమ్ములుదక్కుచుఁ
దగునొసలంగలచిరుచెమట నిరంతరముగనూర్చుచుఁ దరముగనూర్చుచుఁ
దగిలెడుతేటికిజంకుచెలిని వింతగనూరార్చుచుఁదగనూరార్చుచు
డాగుడుమూతలనుల్లసములు జగడంబుగనాడుచు డంబుగనాడుచుఁ
గాగుచుఁదమిఁగొనువికసితకుసుమ నికాయమువాడుచుఁ గాయమువాడుచు
రమణవసంతములాడినకుసుమ పరాగముఁబెంపుచు రాగముఁబెంపుచుఁ
దమతమయలరులువొత్తినసిన సుందరులకుఁబంపుచుఁ దరులకుఁబంపుచు
నలులందెలబెదరిన ముఖరాజీవాదులవాగుచు వాదులవాగుచుఁ
దులకించిననెమ్మలతో లలితగతులకుందూగుచుఁదులకుందూగుచు
రమణీయతఁగేదగిరేకుల నఖరమణులఁజీరుచు రమణులఁజీరుచుఁ
దమిముఖవాసనలం దుమ్మెదబిత్తరులందూరుచుఁ దరులందూరుచు

జడఁజూపియుఁదాపాగ్నిని మధుపవిసరములవేల్చుచు సరములవేల్చుచుఁ
గడుదళసరికర్పూరము హస్తయుగళములఁదాల్చుచు గళములఁదాల్చుచు
సిరులువహించిరిసతులు ఫలభ్రాజితసురసాలన్ జితసురసాలన్
సరసద్యుతిశతశతహసిత దురాసదనవలీలన్ సదనవలీలన్ 67

ఉ॥ నారియొకర్తు చొక్కపు ననల్గల చక్కని చిన్నిపొన్నకున్
జేరి ప్రసూనగుచ్ఛము లశేషముఁగోసియు గ్రేఁశినోర్తు నీ
భూరుహమెక్కుమన్న నగి పూయఁగఁజేయుదు నాకదెంత య
మ్మేరువుగాదుకాదిది నమేరువనందగిపూచెఁగ్రమ్మరన్ 68

తే॥ వారిజాక్షులు సరసభ్యావంబులయిన యరుణతరుణాత్మ పంచశాఖాంచలముల
నంటఁ బ్రాయఃపరిస్ఫూర్తినమరు చూత వాటి సుమభూరిమహితమైవరలకున్నె

చ॥ ధరణితలంబునందుఁ గలదా నవతొక్కటినాదునాస కీ
వరయుమటన్నఁ గేరి యొకయంగనయొత్తెమొగంబు సొటి యి
త్తరి మరియొక్కటీశతశతంబులఁ జూపెదనన్నయట్లుగా
నరిదిఘటిల్లఁగోరకితమయ్యెదళంబుగఁ జంపకాఘమున్ 70

ఆ॥ కొమ్మలురికితన్నఁ గొంచకపైఁబడ నుమియ వకుళవంజుళములకప్పు
డలమబాగతోచె నహహ లోకోత్తర తరులకిదియ నీతిసరణిగాదె 71

ఉ॥ దీనిప్రసూన మమ్మరునితీవ్రఁపుటమ్మయి పాంధగేహినీ
మానమడంచు నన్నగతిమానినియొక్కతెతన్నె నంతటన్
గానగనొప్పె నేతదురుఘాత ముఖప్రవదశ్రుధారలై
సూనగుళుచ్ఛసంఘము లశోకమహీరుహమాళిపాళికిన్ 72

తే॥ ధవళనయనలపాదఘాతములయందు వదలదుత్కంఠికాళిలవంజుళంబు
దానికినశోకమనుబిరుదంపుపేరు మిగులఁజెల్లదెయకట ముజ్జగములందు 73

చ॥ వడినిడేఁజాటు మోమునకు వాతసముద్ధతమైనకెంపుపు
ష్పాడితెరలెండలంచు జలపోతనురంటిరొకర్తు మించుసొం
పడరఁగనట్టినీరజచయంబులుగోయకుమంచు నొంతయున్
జిడిముడిపాటుతో మనవిఁజెప్పఁగవచ్చిననూర్యుఁడోయనన్ 74

చ॥ ఉడుగకయిద్దరొక్కననకోరడిఁబోరఁగనొర్తువారితో
వెడదరదంబులుండియును వెన్నెలదప్ప మెసంగ డేమియున్

గడునొకయంత్రదారియని గాటఁపునీకథవిష్ణుదానికిన్
బడుననవిప్ప నుత్తరిని బన్నడనోర్తు లభించె నీలనముల్ 75

వ॥ అంత

సీ॥ పూదేనెఁజిలికి కెంబుప్పొడి మేడించి చుక్కబొట్టుగ దిద్దనొక్కచెలికి
గన్నెగేదగిరేకు సన్నగిలఁగఁజీరి యొగి దీగగాఁ బెట్టెనొక్కచెలికి
గొనబైన కనకంపుటనటిరేజిగురుటాకొరపుపయ్యెదఁ జేసెనొక్కచెలికి
స్థలపద్మముకుళంబు సరసంపుకుప్పెగాఁ జొక్కంపు నెరిఁ గ్రుచ్చెనొక్కచెలికి
బొన్నపూమొగ్గము త్తియంపుంమిటారి ముక్కరగఁ దీర్చి సేర్చెననొక్కచెలికిఁ
నపుడు కేళీవిలోలాంతరంగుఁ డైన వారిజాక్షుండు శృంగారవనమునందు॥ 77

వ॥ అంత.

సీ॥ మునుకొని సర్వతోముఖభంగమయ్యును ఘనతరామోదంబుగలుగుదాని
నరసి చూడ జడాశయంబయ్యు సంతతహంససేవనమున నమరుదాని
శ్రీమదాపూరితజీవనంబయ్యును నీరజస్థితిని రాణించుదాని
నతులనదీనభావాశ్రయంబయ్యును శక్రకేశ్వరస్ఫూర్తిజరుగుదాని
నొక్కకమలాకరముఁ గాంచి యువిదలెల్ల నక్కజమటంచు నామురహరునిగూడి
యుచితవేషంబు లుధరించియోలలాడ దొడగిరతిసంభ్రమమునఁదత్తోయములను 79

మ॥ సరసీజాళిగతాళిసంఘము నిజేచ్ఛన్వారి నెమ్మోము తా
మరలంజేరి సుగంధలోభమెదగ్రమ్మ ఝంకరించెన్ మనో
హరనాదంబున నంతఁదన్ముఖవిరోధాందోళితాంభోరుహా
త్కరదూత్యంబు భజించి సామములు వక్కాణించుచందంబునన్ 80

సీ॥ నీటిలోపలఁ దననీడఁజూచి దనీరు పాపయోయని యుల్కిపడియెనొకతె
యదెయిదె కొట్టుదమంచుఁ జెంగటనున్న పద్మనాళముఁ గేలఁబట్టెనొకతె
జంకకుమని హస్తకంకణంబులు బిట్టు మొరయ నచ్చెలివీపుఁ జరచెనొకతె
పొలుపొంద వెలిదమ్మిపుప్పొడి మంత్రించి వెరవిభూతిగఁ బెట్టె వెలదియొకతె
వాసిఁ దెలిరేకుమూకటుఁ గేసరాన్న పుంజమపుడు బడిమిఁద్రిప్పిపోసెనొకతె
ప్రేమనీకాళియద్వేషి పేరునుడువ మెలగు సేయిట్టిభయమంచుఁ బలికెనొకతె 81

ఉ॥ చిమ్మనగ్రోవిఁబూని సరసీరుహనేత్రుఁడు నీరుఁజిమ్మఁగాఁ

గొమ్మ యొకర్తు వక్త్రమునకుంబడకుండఁగఁబట్టెఁ బాఁశి భా
గమ్ములు దన్నఖంబులనుగన్పడెఁ జుక్కలు చెందొవల్ తదా
స్యమ్మనుచంద్రబింబమున కడ్డమువచ్చినభంగి నెంతయున్ 82

శా॥ లీలంజిమ్మనగ్రోవిఁదాల్చి చెలి యాలీఢస్థితిన్ నిల్చియు
క్కీలాలం బెగఁజిమ్మఁ బొంకమయివీక్షింపందగెం దత్పయో
జాలం బచ్చెలిహస్తపల్లవము లజ్జాతంబులంగెల్చి యో
పాలోకంబునుతింపనిల్పిన జయస్తంభంబుచందంబునన్ 83

తే॥ ఒకతె మొగమునజతగూడియువిదమీద । నీరుఁజల్లంగనపుడురాణించెవారి
కరములేతెంచునాసుధాకరునకర్ఘ్య పాద్యములొసంగుచెంగల్వబారులనఁగ 84

తే॥ ఇట్లునీరాడిహరియుఁ బూర్ణేందుముఖులు నార్ద్రవస్త్రంబులూడ్చిదివ్యాంబరములు
దాల్చి తొడవులుబెట్టి చందనమలంది కురులుతడియారవిడచి క్రొవ్విరులుముడిచి

చ॥ ఒనరఁగనంతఁగన్నెలపు డొండొరుచొక్కపుఁజెక్కుటద్దముల్
గనుగొని కుంకుమంబుఁదిలకంబుగదిద్దిరి కేరిపుప్పొడుల్
ననలఁబొసంగుకప్పుటనంటిరవల్గొనిపూవుఁదేనెనీ
రునఁబదనిచ్చి సన్నముగఁ గ్రొన్నెలనానుముఁదీర్చిమున్నుగాన్ 86

వ॥ అప్పుడు.

కం॥ మగుడఁగనింటికి నేగుట తగునో యీపూవుమానుదండలనీక లె
స్సగవిశ్రమింపుటదిబా గగునోయని సంశయింపు నాసమయమునన్ 87

సీ॥ పొదలుపూఁదోటలో వెదకి యొచ్చట నెండపొడలేని యొకగుజ్జుపొన్నక్రిందఁ
గపురంపుటనటిలేకంబంబులుగఁజేసి నెరవాదిపూవుఁ బందిరిఘటించి
గొజ్జంగినీరునగ్రుచ్చెత్తి కపురానరంగుమీరంగ వరుఁగువైచి
కనకంపుచకచకల్ గలిగిరంజిలు కన్నెగేదగిపూజాపఁగీలుకొలిపి
మెండుగల్గినమల్లెపూదండదిండు దండనొరుగంగనిల్పి యందంపుఁజిగురు
తోరణముఁగట్టి చావడితీరుదిద్ది యొలమివనపాలుఁ డచ్చటికేగుదెంచి 88

తే॥ వచ్చి యారుక్మిణీసతీవల్లభునకు నతనిదేవేరులకునవంతముదిత
చిత్తుఁడై పలుమరుచేతులెత్తిమ్రొక్కి మన్ననలుబొంది యిట్లనివిన్నవించె 89

కం॥ ఆర్యా కలదొకవిన్నప మియ్యుపవనసీమనిప్డు డేనేర్పుగలిఁ
సెయ్యమినొకపూజప్పర మొయ్యనరచియించితిని సముజ్వలభంగిఁ 9౦

కం॥ ఇందుంగల్గినపూపాద లం దిరిగినయలఘుకయుఁ గొలంకులచలినీ
టం దేలినయలతయుఁ బో వం దాల్మిని విశ్రమింపవలెనిఁకనిచటఁ 9౧

వ॥ అనియిట్లువిన్నవించిన నతనివినయసహితాభిహితంబులకభినందించి యంగీ
కారవ్యంజక లతాంగీముఖచేష్టాదర్శనపూర్వకంబుగా నంగీకరించితదాదిష్టమార్గుండై చ
ని యొప్పులుప్పతిలు నప్పూజప్పరంబునధిష్టించి.

చ॥ పలుమరుత న్నఖాంచలవిపాటితనూతనకేతకాంతరో
జ్వలదళసంఘసంఘటితచారుకటోత్కటకాంతిగాంచి మేల్
భళి యిదివింతయౌర వనపాల యటంచును మెచ్చి వేడ్కతో
నలజలజాక్షుఁ డొక్కయడియార మొసంగె నెసంగవానికిఁ 93

వ॥ అంత.

సీ॥ మండితశ్రీఖండమండలీకోరకంబులఁ జేర డాగురుమూతలాడి
కోరకాపూరితస్ఫారమల్లీలతాజాలంబులందు నుయ్యాలలూగి
ఘనసారకదళికావనసారకళికలసడలు దుమారంబుఁజల్లులాడి
మారందనాభిదఘ్రాణరామసాలాలవాలాళియందులనోలలాడి
యలసియో లేకయప్పురియశ్వవేగ మరసిలజ్జించియో లేకయబ్జముఖుల
జడలుకృష్ణాహులనిచాలతంకపడియొ మెల్లనరుదెంచె బాలసమీరణంబు 95

తే॥ చిరుతతెమ్మెరయపుడుదాక్షిణ్యవృత్తి । జాగి యానతనుమన్యపరాగమెల్ల
వదలఁజేయుచు క్షితిమానవసుఖదాయి । యగుచునలరెను హరినామమమరకున్న॥

కం॥ జిగిగలకెమ్మోవులఁ జిరు। నగవులునిగనిగలుదేర నవ్యాధ్వనితోఁ
దగనందరొక్కమొగిదై । సొగటాలాడుదమటంచు సుదతులుబల్కన్ ॥ 97

చం॥ బలితపుఁబద్మజాండమను పాళిఘటించి చటమీద బద్ధజీ
వుల నెడిసారెలుంచి రహిఁబుట్టఁగ నమ్మిహిరేందుపాచముల్
గల బలుపాచికల్గొని యలౌకికచిత్రదురోదరంబుఁదా
నలరమతోడనాడు కమలాక్షుఁడు మైకొనెనట్టిజూదముల్ ॥ 98

కం॥ అత్తరిఁ జకచకలీనెడు । ముత్తెపుఁబాచికలు కనకపుంబాళికదుశ్
జొత్తిలుఁబగడపుసారెలు । తత్తరమునఁ దెచ్చియొకతె తరుణులకిచ్చెన్ ॥ 99

తే॥ ఇయ్య నవియందుకొనియంత నింతులెల్లఁ । గుండలాకారమొప్పఁ గూర్చుండినడుమఁ
బాళిఘటియించి సారెలుబన్ని తాము । కోర్కెనొండొరులనుజతల్గూడనప్పు ॥ 100

సీ॥ మొగమునకోడిపూరిగఁజిక్కి శరణనిమనఁగవచ్చిన చందమామయనఁగఁ
దనకురాజైనయాతని గొల్వవచ్చిన చుక్కనియుడిగంపుచుక్కయనఁగఁ
జెలికానికాతిక్షవచ్చెనటంచునాతని నరయవచ్చినప్రభాకరుఁడనంగఁ
దొంటివేడిమిఁబాసికంటికింపుగ మేననిండినపాండునీరెండయనఁగ
మురియుతిరుమణిముకుకమ్మిముత్తియంబు । రమ్యపతకంబుపీతాంబరంబు మెరయఁ
జెలులచుంబనపణమాడి చేయిఁజరచి । కేరుచునుజూదమాడె మురారియచట ॥ 101

సీ॥ కంకణంబులుమ్రోఁయగా దుగా బేత్రి చావంచంచుఁబందెముల్ వైచువారు
వాసిఁబందెమువైచి యేసారెయని సారెనంచించితగ సారెలాడువారు
ఆడుమాటల జూదమాడఁగూడదటంచుఁ బరులనుల్లసములుపలుకువారు
తమినోరుసారెచేఁదనసారెఁబడుచు సుందరినోర్తువీక్షించినగెడువారు
నాతియొక్కతె సావధానముగనెత్తు । లంచనఁబుజూడఁగమదత్తరించువారు
నగుచుఁజెలరేగియపుడుదైత్యారితోడ । నింతులితర ప్రపంచంబులెల్లమరచి ॥ 102

వ॥ మరియును. 103

## ర గ డ.

చేడియకోపము చెప్పినమాటకుఁ బాడిదప్పినా భామామాటకు
పేలగఁజూచెద పీడఁగనాడకు తాళముసారెకుఁ దప్పగనాడకు
కనవాయెక్కుడు కనుగవచేరకు వనరివేడ్కఁజనివాదుకుజేరకు
పందెమువైచితి పంజులకమ్మకు సుందరినైకొని సుదతింగమ్మకు
నీమాటలసిరినేరుపుచిల్కకుఁ గోమలివాటపుఁగ్రోధముజిల్కకు
నీకొకఘనమానేర్పులనిక్కకు జోకనుదనుగెల్చుటకునునిక్కకు
హాళినాడ గోరానినజేరకు చాలనులికిపడిచలియలజేరకు
క్షత్రియపాల్గొనుకస్తురియుండకు పొత్తులగెలుపదిపోనిదియుండకు
రామతెలిసెనీరక్కసిదాయకు నీమృషలన్నియు నిజమనిదాయకు
దక్కెయోడెనని తాపపుటుబ్బకు చిక్కదవిటుగెలిచెదననియుబ్బకు

పగిడిపందెమిదిబంగరుగోరకు మగువయొడిక్రమ్మరరాఁగోరకు
బాలగెలిచె నేఁబాడినయేలకు తాళకకటువార్తలనన్నేలకు
వెలదిజంకవే వెన్నునియానకు గెలిచిమొగంబునఁ గికకికలానకు 104

వ॥ అనుచుఁదమలోనమఱియును. 105

సీ॥ సారసాస్యయొకర్తుసారెఁదెచ్చితినన్న సారెకుఁగలుగువాచవియటంచు
వ్రీడావతియొకర్తుజోడుగూడుమటన్న నెవ్వరిమీఁదదండెత్తెదనుచు
వామాక్షియొకతెలేవంచవేయుమటన్న నదిశిల్పిరాకయెట్లౌనటంచు
సుదతియొకతెయెత్తుఁజూడంగదగునన్న నొకపట్లమిగులంగనొప్పననుచు
సరససల్లాపభంగినుత్సాహమొంది చేడెలెల్లదురోదరక్రీడనుండి
రక్షవిక్షేపచలవిలయస్వనోద హస్తముఖపంకజభ్రమద్భ్రమరలగుచు 106

శా॥ పశ్యత్పాదకణా కుమారిలగతృక్పాషండబుద్ధాబ్జభూ
పశ్యత్ఫాలమతప్రచండనుతతత్త్వం కేశజాడ్యాద్రిరా
ట్పశ్యుఁదేహకృపాణదుర్ఘటవచఃపద్యాప్తహృద్యానసా
పశ్యత్స్వాంతశిరఃపరిష్కరణశుంభద్భాష్యకారాహ్వయా 107

గద్య

ఇది శ్రీమద్రామానుజభాగినేయకులసార్వభౌమ
శ్రీమన్నల్లనాచార్యవర్యపరిచర్యాధుర్య
చెన్నకేశవాచార్యపుత్ర
తిరుమలాచార్యపౌత్ర
గౌతమగోత్రపవిత్ర
సింహాద్రివెంకట
నామధేయప్ర
ణీతంబైన

**మహాప్రబంధ చమత్కారమంజరీ కోరకాయితంబగు**
**ప్రథమాశ్వాసము**

---



# చమత్కారమంజరి.

——:(o):——

## ద్వితీయాశ్వాసము.



కం॥ శ్రీమచ్ఛరణపరిసర । స్తోమసముత్తీర్యమాణ దుర్ఘర్ష భవో
ద్దామాబ్ధితలవిమర్శక । శామూలకరత్రివండ లక్ష్మణయోగీ 1

వ॥ అవధరింపుము 2

మ॥ అపుడా ముత్తైపుపాచికల్ విడచి తానాడంగ నందొక్కసా
రెపయింగేలటుసాచి భీష్మకధరిత్రీజానిగారంపుపు
త్రి పరాకయ్యె విలోచనాస్యములనుద్వృత్తాద్భుతావేశచి
హ్నపటూద్భాసివికాసహాసరుచులందంబొప్ప సంధిల్లఁగాన్ 3

సీ॥ కమనీయచలవాతకంబళాందోళితకుండలంబులు దిద్దుకొంటమాని
ధళధళాయితఫాలఫలకనిర్మలఘర్మశీకరంబుల గోటఁ జిమ్మమాని
శ్రుతిపుటీఘటితమంజులమంజరీభ్రమదృంగీగణములఁ దోలంగమాని
తనులతాచ్ఛాదకాదభ్రనీతాభ్ర రంభాపరాగం బెడబాపమాని
చటులతరయోషిద్విషదుచ్చైర్నిబద్ధ । బహుళకింకింక్రియోత్తరభంగిమాని
చేష్టలెల్లనుదక్కియచ్చెలివహించె । ఘనతరంబైన పాంచాలికాక్రమంబు 4

ఉ॥ కొండొకసేపిటు ల్కుటిలకుంతలి గాఢపరాకవస్తచే
నుండి ప్రబుద్ధయై తలయటూచి యొకించుకనవ్వి శార్ఙ్గకో
దండునితోడఁజెల్వాల నుదారతఁగన్గొనుచున్ విలాసితా
ఖండతఁ బందమేరిదనఁ గంజదళాక్షుఁడువల్కె నెమ్మితోన్ 5

కం॥ ఏలపరాకైతివినీ । వాలాగునమాతృసోదరాదులునీకి
వ్వేళఁదలంపునవచ్చిరొ । బాలా నాయాననీకుఁ బన్పడఁజెపుమా 6

చ॥ అనవుడు యక్షేశసుతయు నవ్యవధూవ్యపదేశనాటకా
భినయకథల్ జయింపఁగను బెద్దరయొనర్చియు నంతనాత్మభా
వనిహతవిస్మయప్రభుతవిపక్షభరంబయుతోఁ జివారితో
ననియె నుదారతాఘనరసాయనమాధురిసాధురీతులన్ 7

మ॥ ఇల రేబోన్నకుఁ జేరి ప్రాలి యవితా మెచ్చోటివో వింతరా
చిలుకల్ పల్కఁగ నాలకింపుమఁ బరాక్చిత్తంబుతో నుంటి న
ప్పలుకుం జెప్పుమటంటివేని మనలన్ జాతంగ నీక్షించి య
చ్చెలితో నొక్కశుకంబు మంజులవచశ్శ్రీఁ బల్కె నిబ్భంగులన్ 8

మ॥ తెలియంజూచితి మెంతయున్ నిఖిలదిగ్దేశంబు లాడాడకున్
గలపేరన్నికఁ గన్నకన్నెలఁ గడున్ గన్గొంటి మెందైనను
గలరే యిట్టివిచిత్రపాత్ర శుభదాకారాఢ్య లెంతైన ని
చ్చెలులెల్లన్ మనలక్షణాసతికిలో జ్జేనుమ్ము రమ్యాకృతిన్ 9

కం॥ అరయఁగ నరోచకములీ పురుషమణిం గాంచు నేత్రపుటయుగములకున్
హరహర మురహర పురహర వరసఖనందనుల రూప వైశద్యంబుల్ 10

చ॥ అల మనలక్షణాసతికి నర్హుఁడితండు వరుండు గాఁగఁ గే
వలహితబుద్ధిఁ జూడ బహువల్లభుఁడన్నదియొండె కాని యం
చలశుకభర్త పల్కె నన వాహరి యేగతిఁ బక్షిభాషణం
బులు దెలియంగ నేర్చి తదిపొందుగ నాకెరిఁగింపు మెంతయున్ 11

సీ॥ నావిని భీష్మకనందన పల్కె మావారిపీటను బహిర్వనములోనఁ
గంకాళకటకనాఁ గలదొక్కశక్తి నేనాదేవి దర్శింప నను గుజెల
నొడఁగూడి కన్నియపడచనై యొకనాడు నీరాడి కడుశుద్ధిచీరఁగట్టి
కుడువక మునుప యగ్గుడికేగి బంగారుపూవులనాయమఁ బూజసేసి
యలికఫలకస్థలమున నంజలిఘటించి చక్కదనమును నాయువు సంపదయును
నతులకీర్తియు ధర్మసుస్థితియుఁ గలుగు । మగఁడు గావలయునటంచు మదినిఁ గోరి॥12

కం॥ దుర్గే లీలాలోలిత । భర్గే కరుణాకటాక్షపాలిత తనుభృ
ద్వర్గే రామస్మరణవి । సర్గే మాంపాహియనుచు సాగిలిమ్రొక్కన్ 13

క॥ కలకలముఁ జేసెనవ్వా। కలఁగలవిహగంబు లొక్కగమిన్నైమిగులం
గలగళతనప్పుడుండితి। గలకలతోనేమి దేమి కారణమనుచున్ 14

ఉ॥ అప్పుడు పాంథవేషముననచ్చటనొక్కవృద్ధసిద్ధుఁ డీ
విప్పలుకెట్టిదో యనుచు నెంతయుఁ జింతిల నేల యవ్వ మేల్
జెప్పుటకాని యొండుమరిలేదనియూరడిలంగఁబల్కినా
కప్పరుసాధ్యుఁడిచ్చె వర మండజవాగవబోధసిద్ధిగాన్ 15

ఆ॥ నాటనుండి నాకునానావిహంగమ। భాషలెల్లఁ దెలియఁబడుచునుండు
ననుచుఁ జెప్పఁ గృష్ణుండంగుళి నాసాపు। టీతటమున సంఘటించియపుడు 16

కం॥ మిగుల గనక్కజమనుచును। దెగువంజాలించి కేళి దిగ్గనఁజనియెన్
మృగనయనయోర్తు గిల్కల। పగడపుపావలు నిజాగ్రభాగముననిడన్ 17

వ॥ అప్పుడు నానాప్రసూననికాయకాయమానస్తంభీకృతరంభాకాండంబుపై
నొక్కింతయొరగి కొన్నినలఁజెన్నగుపాన్నలకై మొగమెత్తి 18

తే॥ చాలలోలేక్షణుండై విశాలశాలి। సాలబాలప్రవాళప్రవాళపంజ
రాంతరనితాంతవిశ్రాంతకాంతరాజ। శుకయుగముఁగాంచెఁగాంచనాంశుకధరుండు

కం॥ ఈగతిఁగన్గొని యత్యను। రాగముతోనంతఁ జిల్కరాల్చినయొకపు
న్నాగప్రసవముఁగని యది। వేగమెకెంగేలఁదాల్చి వెలదులతోడన్ 20

మ॥ అమరంగాఁ దమలక్షణాఖ్యకమలాస్యాలోకచూడావతం
సమునాభీపుట మిట్లిసంగుననియిచ్చెన్ స్వాకెరుంగించుచుం
దమునన్ రాజశుకాఢ్య మీవికచపున్నాగప్రసూనంబుఁదా
ల్చె మదగ్రంబున లేమలార మిగులం జిత్రంబుగన్గొంటిరే 21

వ॥ అని వెండియుఁ దదాకారశోభావైలక్షణ్యంబు గాంచి మనుష్యవాగవబోధ
సామర్థ్యంబు వీటికిసంభవించ నేర్చుననితలంచి

సీ॥ ఓరాజకీరంబులార లక్షణయనుకోమలి యేరాజుకూతురొక్కొ
యప్పణ్యసంశీలుఁడైనవిశ్వంభరాధీశుఁడేలెడిది యేదేశమొక్కొ

యట్టిదేశంబున నక్రాంత మమ్మహీధవుఁడున్న దేరాజధానియొక్కొ
పరిశుద్ధ తత్త్వభావస్వభావంబు లేపగిది మీకెఱుఁగఁగబడియెనొక్కొ
యీయలౌకికశోభ మీకెచటిదొక్కొ యిచటికేతేర మీతలం పెద్దియొక్కొ
యిన్నివృత్తాంతములును మాకేర్పడంగ వరుసనెఱిఁగింపుఁడని యదూద్వహుండు వేఁడ్కొ

వ॥ ఇట్లు వేఁడినయతనియాత్మభాషావబోధకౌశలంబునకునక్కజంబంది యతని పున్నాగప్రసవాత్రేపిశ్లక్ష్ణ్యంబునకుమిగులందలయూఁచి యతనిపృచ్ఛావైఖరీ వైశద్యంబునకుమెచ్చి తత్సహసంభాషణాపేక్షులై నికటసముల్లసత్పల్లవకుళమంజరీపంజరంబున నధివసించి యొక్కకీరసార్వభౌమంబు మనుష్యభాషణంబులనిట్లనియె.

కం॥ జోహో గోపురుషోత్తమ । యోహో నీసేయుప్రశ్నమొనరె సుదాహో
రాహంక్రియాపహారి । వ్యాహారాహీన విహితవైఖరితోడన్ 25

వ॥ అనిమఱియును 26

ఉ॥ తానొనరించుదేశములఁ దద్దయు నంచితసంచితాసహ
శ్రీనిరపాయతం దనువశీకృతుఁ జేసిన మెచ్చి భారతీ
జాని యొసంగమద్రమనుసంజ్ఞ నెసంగెడు నొక్కదేశ మో
మానవతీమనోజ మహిమండలిలోఁగల దందునారయన్ 27

మ॥ మతి నెన్నందగి యానువత్సరిక హేమంతార్ధ బాలామనః
కృతబాలాతపసేవనోద్యమ నిరర్థీకారదక్షధ్వజా
యుతవిభ్రాజితభర్మహర్మ్యములతో నుర్వీజనస్తుత్యసం
స్థితిఁ బ్రోలొక్కటి రత్నగోపురమునాఁ జెన్నొందునశ్రాంతమున్॥ 28

తే॥ అదియునిజరాజధానిగా నధివసించి । చెలఁగు నద్దేశపతి బృహత్సేనుఁడనఁగ
నతనికీర్తిప్రతాపంబులరసి యొన్నఁ । ధరను చిత్రశిఖండినందనులకైన॥ 29

కం॥ కోదండచండనిజభుజ । కోదండముదండమేలకో మాకరిరా
డ్వేదండసింహ యిఁక నీ । వేదండనికొలుచు శత్రువిసరములతనిన్॥ 30

సీ॥ తనకునుద్ధతమధుధ్వంసిజాగ్రత్కరాగ్రస్థచక్రంబు కంకణముగాఁగఁ
దనకు జలంధరాంధకహారిబాహురింఖత్త్రిశూలంబు చిక్కంబుగాఁగఁ
దనకు ధరాధరాంతకభుజాభిదురాసితల్లజంబది రచ్చబల్లగాఁగ
దన కంబుధీశహస్తప్రశస్తాగ్రపాశంబు సందిటిదోరకంబుగాఁగ

దనకునుద్దండదండభృద్దండ మెపుడు గొలదివాల్లీసకపుసుమగోల.గాంగం
మించుదుళికించి జగమాక్రమించి మించి । తనరెన మ్మేటి భవ్యప్రతాపలక్ష్మి 31

సీ॥ కాలమేఘుండై నఘనమణో సంఛన్న చంద్రతారకత నిజ్జగతిం బరంగు
నమరాగమైనమానగునకో కీలాలపానంబుంగావించి ఘలమొసంగు
యామినీవల్లభుండై నరాజగునకో తనరారులేఖౌఘసాతయగుచు
వేలుపుటాపైన వెడలెనో కోకొన్నుమ్మెలెపుడుకుంభగ్రాహ్యా మీాగితలపం
డ్యక్తజీవనమైనః బత్రావలంబ మాచరించిన నగ్నిముఖాంతరమునం
బడినం దల్క్రిందయిన నేమిప్రతియె దాన నరణి నెన్న బృహత్సేనధరణిపతికి 32

ఉ॥ ఆతండపుత్రుండౌట మమునాదర మొప్పంగం బెంచె నంత వి
ఖ్యాతగుణాఢ్యులౌ సుతులంగాంచియు వారలకన్న నెంతయుం
బ్రీతిదలిర్పమమ్ముం గడుం బెద్దయుమన్ననసేయు మత్సమా
యాతమహార్త మొప్పగునటంచు సబంధుకళత్రమిత్రుండై॥ 33

సీ॥ రమణ వ్రాయుదుము త్తరములు తత్తద్దేశపతులకు చప్పన్న భాషలెసంగ
వివరింపుదుము పరోర్వీనాథసంధాన ఘనయుక్తి కౌశలగౌరవములు
ధీరయోధుల కుపదేశింతు మతులదుర్గ త్రాణనైపుణీప్రక్రమములు
నీతిశాస్త్రాభినిర్ణీతవైఖరులతోం దగవులుదీర్తు ముత్తములు మెచ్చ
పాసంగరాజాత్మజాలకు జెప్పదుమసంఖ్య । వ్యాద్యసాహిత్యగీతాదివిద్య లెల్ల
సకలదేశాగతమనీషిసుకవిజనుల । చొప్పలెరింగింపుదుము మహీశునకు నెపుడు 34

చం॥ ఒకతరిలోకవార్తలను నొక్కతరిన్మృదుగానకౌశలం
బొకతరిసాహితీరసము లొక్కతరిణ్ఘనసత్కథాక్రమం
బొకతరిశాస్త్రవైఖరులు నొక్కతరిన్నిగమోపధానముల్
ప్రకటనచేసి యాధరణిపాలున కూరటచేతు మెంతయుణ్ 35

ఉ॥ చక్కెరలప్పముల్ మధురసంబును జున్ను రసాయనంబులుణ్
జిక్కనిమీాగడల్ ఫలవిశేషములుం న్నుసుము న్నెమాకుం థా
నెక్కుడు ప్రేమతోడ భుజియించంగం బెట్టక పుక్కిలింప దా
చొక్కపువస్త్రనల్గలిగి శోభిలంపట్టపుదేవి యొప్పడుణ్ 36

వ॥ ఇంక మద్గమనకారణంబువిన్నవించెద మవధరింపుము 37

ఉత్సాహ॥ బల్లిదంపు నెవ్వ నొవ్వఁ బాఱియున్న యీజగం
బెల్లఁ జూచి శివుఁ బ్రోవ నిందిరేశ్వరుండు దాఁ
గొల్లవాఁడుఁ బందులుండుగుజ్జుముంతమావిస్త్రీ
యుల్లసిల్లెఁ దొల్లి యొల్లియోయనంగ ధాత్రికిన్ 38

గీ॥ తన్మనోహరకోటరాంతరమునందు । నత్యలౌకికతేజోమహత్వమునను
బుట్టితిమిముప్పురముకీరపుంగవులము । వాణి యతివాణియును మహావాణియనఁగ

సీ॥ అందుమహావాణియనియెడుమజ్జ్యేష్ఠశుకశిఖామణి కళాస్ఫూర్తినొప్పి
యహరహంబు నపారబహుమానలీలతో వాగ్దేవికరపల్లవముననుండు
నాచిల్కఁగనిద్వాదశాబ్దముల్ గావచ్చె నదిగానబ్రహ్మలోకాంతరమున
కరిగికన్గొనిముద్దులాడి క్రమ్మఱ నేగుదెంచుచున్నారమీ తెరువుచేరి
మరియునిటమీఁదమారాజమదనుపుత్రి । యమితలక్షణ లక్షణయనఁగబరఁగు
నట్టికన్నియ కీడుజోడైనవరుని । వరసి వెదకుచు నిపుఁడు మే మచటనచట 40

గీ॥ ఆనరారోహరూపరేఖావిలాస । విభ్రమంబులువర్ణింప విధి కశక్య
మైన నానేర్పుగతిఁ బురుషాగ్రగణ్య । నీకు నెఱిఁగింపవలసివర్ణింతుఁ గాత 41

చ॥ మెలఁత మొగంబు చందురుని మెచ్చుఁ గుచంబులు కుందనంపుబిం
డెలకగుసం ప్రతిరల్ తళుకుదేఱుఁడుకన్నులుబిత్తరంపుగ
ల్వలపొరు గింద్రనీలపుశలాకలవంగడమారుతీవె తేఁ
టులపదుగందపుం నెరికడుర్ బిగియాజిగి నెన్నిగూచినన్ 42

గీ॥ అరుణపల్లవములఁబోలు నాపదంము । నాపదంబులఁబోలు నయ్యాలకజాతిఁ
మలకజాతముఁబోలు నిత్యముఖలీల । నిత్యముఖలీలబోలును న్నెలతనడుము 43

సీ॥ మరునివిల్లెక్కుడుపొరయకుండగనాగ శివవిలాసస్ఫూర్తిఁ జెందుబొమలు
పేరనంటులఁ బెచ్చుపెరుఁగకుండగవంచె భద్రలక్షణములఁబరఁగుతొడలు
జెలువైనకృష్ణాహి తలఁద్రొక్కకుండంగనడఁచె విరాజితంబైనయారు
సొగసుమీలను ముల్లుచూపకుండహరించె ఘనరశ్మిజాలవాకన్నుదోయి

యిందుకళలెల్ల గణనకు నెక్కకుండఁ। బట్టె బహుళద్యుతుల్ గలఘాలతలను
గండు నెమ్ముల బొడచూపకుండఁ జేసె। వితతశుచిపూర్తిగల యలివేణివేణి 44

క॥ చన్నులకొకగుటియె పదా। ర్వన్నెపసిఁడితమ్మిమొగడవన్నెల్ గిన్నెల్
కన్నియపిఱుఁదున కెదురే। చెన్నగుబలుదీవిగలుగు సిరులుఁ గిరులుఁ 45

గీ॥ అల్పతరమఁట యాసరోజాక్షిమధ్య। మెన్న నది సుఖమైతోఁచకున్నె పతికి
ఘనతరంబఁట యాకంబుకంఠిజంఘ। మెన్నసె సహ్యమై తోఁచకున్నె పతికి 46

చం॥ చెలిగళసీమతోడ నెనసేయఁగనొంశువరంబె మానినీ
తిలకమునాభితో సవతుదేసుకరంబె లంతాంగికుక్షితో
లలినొకటీడుచూపఁగదరంబె మదిఁ గడుసాహసించి యా
నెలతుకకౌనుతో సరిగణింపఁగఁబూనసుఖంబె యేరికిఁ 47

సీ॥ తారావళులఁబట్టి తారావళులఁ జేయుసత్వంబుఁజూపె నా సఖి నఖములు
నీరజంబునుఁబట్టినీరజంబుగఁ జేయుసారస్యమొంచె నా చానమోము
మదవారణముఁబట్టిమదవారణము జేయుభద్రతమొసె నాపడతినడక
యాపదాళులఁబట్టియాపదాళులఁ జేయుఘనతకుఁ బెనగె నా కాంతవేణి
యెక్కువలయంబులనుదమి నేపుమీర। నెక్కువ లయంబులొనరించునీక్షణములు
ప్రౌఢిజీవనభంగముల్ ప్రాతికూల్య। మునుప జీవనభంగముల్ పెసుచు వళులు

సీ॥ బాలపాక్కిలి కొక్కబావి జోడంటిమా యుల బరోద్ఘాటనంబులఁ గృశించు
సతిమోమునకుఁ దమ్మి సరియంటిమాభువనంబులోమిగులంగ నాలియయ్యెఁ
గొమ్మపాలిండ్లకుఁ గొండ లీడంటిమా బ్రతుకెల్ల రాకొట్టుపాలు జేసె
వెలఁదిచూపులకుఁ బూవింటిజోదమ్ములు సాటంటిమా విరిపోటులయ్యె
నొగి మహారామపదనిష్ఠమున్న ఘనమ। శాఖిశాయితనున్న శైలాఖ్యమున్నఁ
దగఁ బరాశ్రయితమున్నఁ దత్తదంగ। రూపభాగ్యంబులవి చెందనోప వెందు 49

మ॥ వనజాక్షీతిలకంబుపాక్కిలిమహావాప్యాకృతిఁ సంగ్రహిం
చిన మూలంబున నక్షయస్ఫురణచేఁ జెన్నొందు టాశ్చర్యమే
యనఁగానేల విశేషజాతిసమవాయశ్రీమయంబై వధూ

జనచూడామణిమన్నియంగమార్గవమునిస్వామాన్యమాటబ్రహ్మే 50

చం॥ అల చెలి లంబకేశనిచయంబునుతింపఁదరంబె యయ్యరో
విలసితముఖ్యవర్ణమునువీడనియద్దియొదానిసాటి గు
బ్బలసిరులన్నఁజోద్యములు భవ్యతరాగ్రతనొప్పనవ్వియే
కొలదులు వానికింకనొనగూడునె యున్నవి యెన్నియేనియున్ 51

కం॥ అ న్నలుమోములదేవుం । డ న్నాతికి లేదు మధ్యమని చెప్పుటకై
సున్న లిఖించినకై వడిఁ । గన్నియకునునాభి వింతకాంతులనమరున్ 52

చం॥ లలితకటీరఘుధ్వజవిలాసమహీధరనాభికందర
స్థలరుహరోమరాజిసముదాత్త తమాల లతాధివాస మాం
సలకుచ చక్రదంపతులు చక్కఁగఁదెచ్చుమృణాళనాళవ
ల్లులగతినొప్పఁ బంకజవిలోచనబాహువు లింపునింపుచున్ 53

చం॥ అలకటి కప్పఁగొప్పుఘనహాటకవారిదఘోటకాశ్మముల్
కళుకులు దేరఁజెక్కుసరిగద్దెలునిద్దపువెన్ను నెత్తపుం
బలుకయు నయ్యెఁ గల్కి యలప్రాయపుఁగ్రొవ్విరితోటలోన వ
ర్తిలురతికాంతకున్ మొగలిరేకుకటారిమిటారిరౌతుకున్ 54

మ॥ అల పుష్పంబులు జెందెఁ బొందుపడ నయ్యబ్జాక్షిహాసాంకురా
త్యలఘుశ్రీలకుఁదక్కువై మిగుల నూనాంకంబుఁ దత్కాంతికాం
త్యల జన్మంబులు పెక్కుసేయఁ బ్రసనాఖ్యం దానఁ జొక్కంపుఁ జా
యలుగల్గన్ సుమసంజ్ఞ నంత సుమనఃఖ్యాతిన్ సుచిత్తస్థితిన్ 55

తే॥గీ॥ అట్టికన్యాలలామంబు నంబుజాక్ష। నీవెవరియొంపఁదగుదువు నిక్క మింక
దేవ దేవరనామంబు దెలియవలయు । నన్ను నెరిఁగించె శ్రీకృష్ణుఁడనుచు నొకతె

వ॥ అంతనక్రూరసార్వభౌమంబు పుఃపునరభివందనంబులాచరించి 57

సీ॥ మంగళంతే ఉఖిలామ్నాయశాఖాశిఖా పల్లవాయితదివ్యభవ్యచరణ
మంగళంతే రమామానినీకుచశైలనీలాంబుదీభవన్నిర్మలాంగ

మంగళంతే నాభిమహితసరస్థపంకేరుహకర్ణికీకృతవిరించ
మంగళంతే ఽంఘ్రితామరసనిష్యందమరందద్భగీరథనందనీక
మంగళంతే ఽక్షిభాపసంప్రాప్తయామి। నీశదినకర తౌల్యపరిక్షమాణ
హస్తగతకీర్తితేజఃప్రశస్తదీప్త। శంఖచక్రాభరణ దేవసార్వభౌమ 58

చక్రబంధము

శా॥ సత్యాభాతనవేందుమౌళిరచితాసంఖ్యాప్రకారస్తనా
నత్యేష్యస్ఫుభకరాభ్రమభానరతతన్మాకన్యకాకృష్టధీ
రత్యేకార్ద్రకటాక్షపక్ష్మరధకైతావిశ్వభూతిధువా
వాత్యాభూసలిలానలాంబరమయీ వాఘీరథీరోత్సవా 59

పుష్పబంధము

స్రగ్ధర॥ రామాకామా రమాసంశ్రయ నయజయసంగ్రామసీమప్రమత్తా
థామాత్మామార్యమాభూధరవరభరణా దారితారిస్వరిభ్య
స్థేమాసామాగమానందితిహతవితతాశ్రీకలోకత్రికప్ర
క్రామా శ్యామాబ్జమాలాక్రమవిమలమహాకాయ గేయప్రయత్నా 60

వ॥ అని స్తుతించి 61

ఉ॥ నీకునభీష్టమేని రమణీయగుణోదయ భవ్యనవ్యలీ
లాకలితాయతాక్షి యలలక్షణనాఁ గలకొమ్మ సమ్మతో
ద్రేకమెలర్పఁగన్ నినువరింపఁగఁజేయుదు రాయబారినై
యో కమలేశ పదమహోత్పలదాస్యమె యోగ్యశమాటచేన్ 62

వ॥ అని సాంత్వకరణంబుగా నక్రూరసార్వభౌమంబు సర్వంబు విన్నవించిన వి
స్మితస్మితవదనుండై యవ్వలవీవిభుండు 63

శా॥ రామాకోమలరామణీయకకథాప్రారంభముల్ నిర్ఝరాం
ధోమాధుర్యధురీణముల్ మొదల సంస్తుత్యత్వదీయాచ్ఛ వా
చామార్గంబున నిర్గమించిన విశేషస్ఫూర్తితో నవ్వి యో
కామాశ్వాన్వయ భూరిభూరితర సౌగంధ్యస్థితిన్ బొల్పవే 64

క॥ నీ వప్రార్థితపూర్వము । గా వెలఁది నినుఁ వరింపఁగాఁజేయుదు నే
వే వేగననుచుఁబల్కుట । భూవినుతా కొంగుముడియ పోలుఁ దలంపన్ 65

సీ॥ అఖిలవత్సరములు నంబుజాక్షి వియోగులకు విలంబు లోగుణసముద్ర
యుభయాయనములుఁ గాంతోరుదుర్విధులకు నుత్తరంబులు విచిత్రోజ్వలాంగ
ఋతువులన్నియు సుందరీదూరులకు శరత్తులు కీరవంశపాథోధిచంద్ర
సకలమాసములు యోషారిక్తజనులకు జ్యేష్ఠంబు లమలభూయిష్టచరిత
పక్షములు రెండు బహుళమున్ ప్రాజ్ఞతిలక । తిథుల శేషము దశములు ద్రిక్తతేజ
వారములుసర్వమును గురువారములు ప్ర । మానశరహయప్రియవధూశూన్యులకును

చం॥అలికచయూరురంభల భుజాంచితశాఖల నాభిదీర్ఘికన్
బలితపుగబ్బిగుబ్బ పువుబంతులఁ జెల్వగునవ్వునెన్నెలన్
గళకులుగుల్కుపల్కునునుగప్రపుఁబల్కుల మోవిపానకం
బులఁ దనివందికా కెటులువుచ్చెద నిట్టివియోగతాపమున్ 67

క॥ అదికాక యింక నే నా । మదనునితరితీపులకునుమార్వడలే నో
మృదుహృదయ తత్సుధాకర । వదనన్ ఘటియింపజేయవలయున్ వేగన్ 68

క॥ వలవదు తెలుపఁగ విద్వ । త్కులతిలకమ నీకుఁ గార్య గురుతర సరణుల్
తళతళమను రెక్కలతో । వెలసినఖగపతికిఁ దగటి వీ వనవలె నే 69

వ॥ అని యనురాగవ్యంజకంబుగాఁ బల్కిన నప్పుడు 70

చం॥ లలనకుచంబు లిట్టుకరలభ్యములయ్యెడునీకునంచు న
చ్చిలుకలు రేడు దీవెనలు చేసియొసంగె సురారివైరికిన్
జలరుహగర్భ లోకపదసంగతిరాఁ దన కింద్రుఁడేర్చి సం
బళముగగట్టునందనజభవ్యఫలంబులు రెండు మెండుగన్ 71

వ॥ ఇట్లుసమర్పించి దేవా వాచాడంబరవిలంబనంబు లింక నుచితరంబులుగావు గా
వున వెడలెద నాజ్ఞాపింపుమని యక్కీరసార్వభౌమంబుపునరభివందనంబొనరించి సా
నుకూలంబై రత్నగోపురనగరాభిముఖ్యంబునన్ జనియె నంతనచ్చట 72

సీ॥ చిన్నటనాఁడు కార్చిచ్చు జేఁజుట్టఁగాఁ బీల్చినబింకముల్ చెపుకవయ్యె
సల నాఁడు సుడిగాలి నలయించి పొలియఁగఁ జదుపు జంఘాటముల్ సాగవయ్యెఁ
బోనాఁడు రాముఁడై బూతంపుఁ జిల్కలఁ గొట్టినబడబడల్ గట్టువడియె
మునుపు గజేంద్రుఁ బట్టినకోల్ మొసలిఁ బోవనడచు మహాశాహల్ నడువవయ్యె
నపుడు తను నేచుఘన విరహాగ్నియందు । మలయపవనునియందు రాచిలుకలందు
మరు సిడమునందు మద్రభూవరకులోత్తమాత్మజాయత్తచిత్తుఁడైనట్టి హరికి 73

చ॥ కమఠకిటిక్షితీశకులఖండనవామనజన్మవాసనా
క్రమమున సంఘచన్నఖత గాంచును జీరుగ రాతలంబుని
త్యముమరి రాజవంగలఁగుఁ దద్దయు మానము దాల్చు రుక్మిణీ
రమణుడు పంచసాయకశరారుశరాహతి పాలితాత్ముఁడై 74

క॥ నీలాంగుఁడు శుకవర్ణిత । బాలాజఘనేక్షణములు భావించుకొనున్
నాళీకాస్త్రుఁడు చిత్తము । నేలకు గోలకును దెచ్చు నేర్పరి గాడే 75

వ॥ అంతఁ దదంతఃపుర కాంతావర్గంబును స్వాతిశయితరూపరేఖాసంపన్న సప
త్నీసమాగమసహితభూతనిజపాండిత్య ప్రపంచయైనరుక్మిణి నుద్దేశించి 76

సీ॥ తననఖప్రకరంబు తనకె వాఁడితనంబు చూపెఁ గాయని సత్య మోపియాడె
తన్నుఁ గట్టఁగఁ ద్రాళ్లు తానె తెచ్చునటంచు నతిని నారతఁ బల్కె వాసుదంత
ని ప్పని యెడిమాత్రనే నోరుపొక్కనాయని చెప్పెఁ గాఁ బోలు ననియె భద్ర
మంచిమాటల నాటమాని యోడించుకోవలసెఁ గాయనె జాంబవత్తనూజ
చేయునవి యింక గతజలసేతుబంధ । మిత్రములటంచు బల్కెన మిత్రవింద
యనఁగ నేటికి దైవమన్యత్రచింత । యే త్తనుచుఁ బల్కె యూరార్చెనివతనూజ 77

వ॥ అప్పుడు మాధవుండు శుకపికనికరకోలాహలభీకరంబయిన యవ్వనంబు వెడ
లి నిజమందిరంబుం బ్రవేశించి సముల్లసితపల్లవతల్పజకేళీశాలాప్రదేశంబున నమ్మాను
వాల్చి యక్కీరకులధురంధరుపునరాగమనంబు ననిరీక్షించుచుండె । నొక్కభంగి నంతని
క్కడ

సీ॥ వరపచేళిమ ఫలాస్వాదనలీలతో బెళిదంపుఁ బడవులు వెడలి వెడలి

శతపత్రఘుమఘుమాంచిత జలకేళితో గాటంపుఁగయ్యాలు దాఁటిదాఁటి
రంగత్సముత్తుంగ శృంగవిశ్రాంతితో మెండైనకొండల మించిమించి
తత్రత్యవస్తు సందర్శనఖేలతోఁ గడుపెద్దపల్లెలుగటచిగడచి
హర్మ్యగత గాతృ గీత ఖేదాభ్యుదీత । ఘనఘనాఘనవృత్త్య దగారబర్హి
రుతసముత్కృ ట్యదంతికారుణరథాహిబంధయగునాత్మపురిఁజేరెఁబతగమౌళి 79

తే॥ రత్నగోపురమీరీతి రాజశుకము । చేరి హర్షంబుతో బ్బ్రహత్సేనునతని
దేవిఁగని మ్రొక్కి పుత్రపుత్రీగణంబు । నుచితవైఖరి మిగులబహూకరించి 80

శా॥ అంతన్ వారికిబ్రహ్మలోకమున నిత్యంబుంబ్రవర్తిల్లువృ
త్తాంతంబంతయు బూసగుచ్చుగతినభ్యంచద్వచస్ఫూర్తితో
నెంతేవింతగఁజెప్పి యిచ్చెమరి మానీంద్రాదిధార్యంబు ల
శ్రాంతాక్లాంతసుగంధసాంద్రములు భాషాదేవినిర్మాల్యముల్ 81

వ॥ మరియు నక్కీరసార్వభౌమంబు మజ్జన భోజనాద్యుపచారంబుల విశ్రమిం
చి సుఖంబుండ లక్షణాకన్య యేతెంచియిటనియె 82

కం॥ ఓయీ రామన క్రిమ్మర । వే యిటకేతెంతుననుచు వెడలియు నిటు ల
త్యాయతమగునాలస్యము । జేయ నిమిత్తంబునాకుఁ జెపుమాయనినన్ 83

చ॥ వినిశుకరాజ మమ్మథుపవేశికియిట్లని చెప్పె వేగఁ ద
ద్ఘనపథపద్ధతిన్ వెడలి క్రిమ్మర మేమిటురాగ నేత్రముల్
దనివిదసింపఁ దత్ప్రతిఫలత్సురలోకమనంగ నంబుధిన్
గనఁదగెనొక్కపట్టణ మఖండితమండితభర్మహార్మ్యమై 84

వ॥ మరియును 85

సీ॥ స్ఫారహీరమసారసారవారాభినిర్మితసాలరేఖకు మెచ్చిమెచ్చి
యంబరసరిదంబచుంబికేతుకదంబకాంబరాద్రితకు లో నలరియలరి
హాటకఖేటకవ్యాప్తనాటకకూటవైచిత్రి కాదల యూఁచియూఁచి
రంగదంగణనటత్తుంగతరంగవిస్ఫురితమూర్తికి మదిఁజొక్కిచొక్కి

వెడలఁ జాలక యమ్మేటిపీటిలోన । గాటమైయొప్పు నొకపూవుదోటనున్న
పొన్నపై బ్రవాళి విశ్రమింపుచును గంటి । మప్పుడటక్రింద నొకపూవుజప్పరంబు

వ॥ అందు 87

సీ॥ ఘుమఘుమల్ దిలకించు గుత్తంపుసిగచుట్టు బొండుమల్లియపువ్వుగండవాని
నడుమఁగస్తురిరేఖయిడిన క్రొన్నెలనామ మలతినౌ మోమున నలరెవాని
నిద్దంపుసుప్పాణినిడుదయుంటులఁ దేరుతళతళల్ చెక్కులఁ దనరువాని
బంగారుచాయచేఁ బొంగారుపచ్చని జిలుగుదుప్పటముపైఁ జెలఁగువాని
యఱుత గుఱుతైనపతక మల్లాడువాని బలచవలఁదినసిరిగంద మలరువాని
జేడియలతోడఁ జూదంబు లాడువానిఁ । గాంత కన్నులుచల్లఁగాఁగంటినొకని 88

సీ॥ అతనికన్నుల చెన్ను లంబుజంబుల కెల్లదిట్టలై చక్కట్లు దిద్దునమ్మ
యతనిచేతులరీతు లభినవామర్త్య మహీజశాఖల నేర మెన్నునమ్మ
యతనిగోరులతీరు లమలకైరవ పలాశావళిఁదూలఁ బోనాడునమ్మ
యతనిమాటలతేట లతిసుధాధారల ఘట్టించిమిగులఁ జీకొట్టునమ్మ
యతనిచెక్కులటెక్కు లున్నతివహించు । మించుటద్దంపుజిగి నీసడించునమ్మ
యతనితళుకులబెళుకు లత్యలఘునీల । పాళికలనెంతయును సిగ్గుపరచునమ్మ

మ॥ బిగువుంజన్నులుగాంచిమాను నల జంబీరంబు బీరంబుఁ గ్రొం
జిగిమోముల్గనిసిగ్గునన్ వదలు రాజీవంబు జీవంబు విం
తగ భ్రూరేఖలుఁజూచిభీతిలును గోదండంబుదండంబు త
జ్జగతీమోహనుఁ బ్రోలనున్న చెలులం జర్చింపఁగాశక్యమే 90

చం॥ వినుమతడెంతజాణయొ యవేద్యమదీరితజాతిభాష నె
మ్మనముఁజక్కఁగాఁదెలిసి మమ్ముసనీతివినీతివాక్యముల్
దనరఁగఁబల్కరించెఁ బ్రమదంబున నేనువారిచెంత యం
దొనరుప్రవాళపీఠమున నుండి సుబోధమనుష్యభాషలన్ 96

సీ॥ మొదలజెప్పితిని వాపూలచూడముగ మచ్చారుకులస్వామి పౌరుషములు
అటమీఁద సరహస్యమైయొప్పఁదెలిపితిఁ గలితయాతాయాత కార్యసరణి

లంతఁ బ్రసంగత నతిసుబోధముగ నుపన్యసించితి శాస్త్రార్థంబులెల్లఁ
దదనంతరమున నెంతయు సవిశేషంబుగాఁ జూపితిని గానకౌశలంబు
మరియు బ్రహ్మాదిలోకసామ్రాజ్యవర్త । మాన మెంతయుఁ గరతలామలకముగను
విన్నవించితిఁ బ్రమదమావిర్భవింప । నాజగన్మోహనునితోడ నంబుజాక్షి 92

ఉ॥ అక్కజమైనచక్కఁదన మారయ వేలుపురాచబిడ్డకుఁ
జక్కెరమెక్కు జక్కిగలజాణకుఁ దండ్రియతండు కందురే
దొక్కటి వింతదానకళ యొప్పున నత్తెరగంటి యీగికిఁ
జొక్కపురేడి తేరుగలశూరుని చూలికిఁ దాత మానినీ

వ॥ వెండియు 94

కం॥ పురుషుండాతఁడు కృష్ణుఁడు పురమది ద్వారకయటంచుఁ బొసఁగఁగఁ నొకత
త్పరిచారిణి వలనంగడు । నెరిగి మహానందభరితహృదయుత నుంటిన్ 95

వ॥ అదియునుంగాక మున్ను పెద్దలవలనఁ దత్స్వరూపస్వభావంబులు వినియుం
డుదు నతండు లీలామానుషుండగు శ్రీవల్లభుండుగాని సామాన్యుండుగాడు మరి
యును 96

ఉ॥ అతఁడు నిన్వరించుటకు నర్హుఁడుగాఁ దలపోసి నీ మనో
జ్ఞాతతరూపరేఖలపు డన్నియుఁ జెప్పక జెప్పినట్లు నేఁ
జాతురితో వచింపఁ గడుసంతసమంది నిజాంబుజాననా
జ్ఞాతముఖానురాగమున ఛన్నముఁ జేసెను దత్ప్రమోదముల్ 97

సీ॥ శుక్రపక్షోజ నీచన్నులు సఫలమూర్తులటంచుఁ బొగడంగ దొరయునమ్మ
వారిజాతాక్షి నీవాల్గన్ను లతనులక్షణములంచు నుతింపఁ జాలునమ్మ
కాండాసనభ్రూయుగళ నీదుబొమలు రేఖాశాలులనఁ గీర్తిగాంచునమ్మ
కరభోరుయుగళ నీకలికిలేదొడలు భద్రకరంబులన నుచితంబులమ్మ
కంతుజక్కఁదనంబు జయంతుసొగసు । నలవసంతునివింతయొయ్యారి పంతు
కన్నకువుసేయు నారాయావస్నకాని । బిగువుకౌగిలి నీకుఁ లభించె నేని 98

తే॥ తగినమగవానికాగిటఁ । దవరగల్గు । నలిచికురయౌవనంబది యౌవనంబు
తగినమగవానికాగిటఁ దనరలేని । యలిచికురయౌవనంబది యౌవనంబు॥ 99

వ॥ అని యక్కీరరాజంబు యావదర్థబోధనవైశద్యహృద్యంబులును ననేకాభిప్రాయసందర్భగర్భంబులును బ్రేమప్రసక్తమానకౌశలపేశలంబులును సుధామాధుర్యంబులును దయారసావగాహనమోహనంబులును నైనవాక్యంబు లపరిమితంబుగాఁబల్కినఁ దత్సమయంబున. 100

కవిరాజవిరాజితము.

వరపరిచారక సంస్కృతితారక వాంఛితపూరక హేమమయాం
బరపదధారక ధీరచకోరకమండలతారకనాథ సువి
స్తరసవికారక వేదవిదూరక శాస్త్రవిదారక శుభ్రగరు
త్సరసిజకోరక సింహకిశోరక సౌష్ఠవవారకచారుకళా 101

గద్య.

ఇది శ్రీమద్రామానుజభాగినేయకులసార్వభౌమ శ్రీమన్నల్లనాచార్యపరిచర్యధుర్య చెన్నకేశవాచార్యపుత్ర తిరుమలాచార్యపౌత్ర గౌతమగోత్ర సింహాద్రివెంకటనామధేయ ప్రణీతంబైన మహాప్రబంధ చమత్కారమంజరీకోరకాయితంబగు ద్వితీయాశ్వాసము.

---



# చ మ త్కా ర మ ం జ రి.

——:[o]:——

## తృ తీ యా శ్వా స ము .

---

కం॥ శ్రీనిలయపాదభక్త స । మానాధికవహితమోక్షమంత్రీకృత ని
త్యానందాహవశుభ రా । మానుజనిజనామధేయ యతికులతిలకా॥ 1

వ॥ అవధరింపుము. 2

ఉ॥ అవనితాశిరోమణియు హర్షమిగుర్పఁగఁబల్కెఁజిల్కతో
నీవటకేగు వెన్కఁ దరుణీజనముల్ గొలువంగ దంతపుం
జావడిమీఁదఁ గుందనపుజంత్రముమీటఁ దదీయతాళశి
క్షావిధి కాడిన ట్టెడమకన్నదరంబలుమారు నంతటన్. 3

సీ॥ వాతపోతక సమాధూతపింగళజటాఝూటసౌదామినీసముదయంబు
రమణీయతర రమారమణీరమారమణానుభవాత్రిశు పయఃకణములు
గలితరణద్వల్లకీకాండసంఘటితాభిరామ కోమలకృష్ణనామదర్భ
ఖండనాఖండితతాండవోచిత చామరాంకమిళద్బలాకావళియును
మెండుకొనిమింటదుగ్ధాబ్ధిదండనుండి । నీరదముబోలెఁజనుదెంచె నారదుండు
బహుళతనుకాంతినిర్జిత పారదుండు । సకలవేదాంతవిద్యా విశారదుండు. 4

కం॥ వచ్చిననంజలియిడి నే । నిచ్చినయర్ఘ్యాదికమున కెంతయుమదిలోఁ
మెచ్చి వరుఁడెవ్వఁడనుచున్ । దెచ్చిప్రసంగంబుఁ జిత్తధృతినిట్లనియెన్. 5

కం॥ ఓకాంత ద్వారవతిలోఁ । శ్రీకృష్ణుఁడనంగఁ బురుషసింహుండుగలం
డాకారవిజితమకర ప । తాకుఁడువిభవానమిత శతక్రతుఁడెన్నన్ 6

చ॥ అతనివరింపవేని జలజానన నీ యకలంకవిభ్రమా
న్వితమగురూప మబ్ధిఁ బ్రభవించినవర్షము రీతినిష్ఫలం
బతనివరించితేని జలజానన నీ యకలంకవిభ్రమా
న్వితమగురూప మించు జనియించుఫలంబయి యొప్పు నెప్పుడున్ 7

తే॥ శుద్ధవిజ్ఞానయోగదక్షులము గాన । మాకెఱుంగనియది లేదు లోకములను
ధరణిలోఁ గృష్ణుఁడే నీకుఁ దగిన మగఁడు । పడుచయిదినమ్ము మాతండ్రిబ్రహ్మయాన

చ॥ కమలదళాక్షి కృష్ణుఁబిగిఁ గౌఁగిటఁ జేరఁగఁ గల్గుదన్క సాం
తముఁ గ్రహించి యిద్ది వివిధంబుగఁ బాడుచుఁ బ్రొద్దుబుచ్చుమం
చమరఁగ వ్రాసి యిచ్చెను దదంకనసంకలితాత్మవాక్యదం
బమునఁ జెలంగు గీతము ప్రబంధమునుం గరుణాసమగ్రతన్ 10

వ॥ ఇట్లనేకవిధంబుల నాదరించి యమ్మునిపుంగవుం డంతర్హితుండయ్యె నేనును దద్వాక్యంబులు విశ్వసించి కృష్ణయికవగణలాలసమానసనై భవదాగమనంబు నిరీక్షించుచుండ నీవును వేగుదెంచి తదీయపాణిగ్రహణంబె బోధించితివి 11

క॥ మేలిది రోగియు వెజ్జును । బాలే కోరినవిధంబు పాటిల్లుచు నీ
వేళకు రెండొక్కటియై - చాలమనోమోదనంబు సాగించెఁ జుమీ 12

వ॥ అనిన విని యక్రూరం బభినందించి 13

క॥ ఈతరి నినిట్టికార్యము । భూతలపతి కెఱుఁగఁ జెప్పఁ బోవలయును "మనః
పూతం సమాచరే"త్తన । నోతరుణీ వినవె వార్త యుర్వీస్థలిలోన్ 14

క॥ అని మరియు రాజుపాలికిఁ । జని తద్వృత్తాంత మెల్ల సరసోక్తులచే
వినుపింపనిట్లు నేఁడె । ప్పని పనిఁ జేసితివటన్నఁ బరమప్రీతిన్ 15

క॥ గణనాగోచరసముచిత । ఘణనాకార్యంబుఁ జెప్పఁ బట్టదు నీకున్
మణిజాతికిఁ గాక నభో । మణికి మెఱుంగిడఁగ వశమె మదినూహింపన్ 16

వ॥ అని మరియు. 17

తే॥ దండియగు విల్లు మత్స్యయంత్రమును బెట్టి । యిద్ది మా పెట్టి యీయంత్ర మెవ్వఁడేని

సేయువానికి నాపుత్రినిత్తుననుచు । నట్టిచాటించెధర్మశీలుఁడవనియం దు 18

వ॥ అంతనతండు సేయు స్వర్ణాగమనోపాయంబునకు నానందించియతనివీడ్కొని

తే॥ మగుడ నేతెంచునక్రూరమౌళిఁ బల్కెఁ । బంచముఖమధ్య కొంచక వంచితప్ర
పంచ యువజనసంచయపంచవిశిఖ । పంచవిశిఖదళన్మనఃపద్మయగుచు 20

సీ॥ రామన్న యిట్టిసిరాలితాళగజాల సొబగుచెల్లెలిఁ బ్రేమఁ జూడవోయి
రామన్న చూచి తిరముగా "శుభస్యశీఘ్రం" బన్నవార్తలోఁ గాంచవోయి
రామన్న కాంచి ద్వారవతీపురంబున కతివేగశాలివై యరుగవోయి
రామన్న యరిగి నిర్జనతరంబై నట్టియవసరంబొక్కటి యరయవోయి
యరసి రామన్న యిట్టివృత్తాంతమెల్లఁ । జెవికినింపుగ రమణుతోఁ జెప్పవోయి
చెప్పి రామన్న యచ్చెలిజీవితంబు । నీదుపైనున్నదనుచు వర్ణింపవోయి 21

తే॥ పండితోత్తమ శుకసార్వభౌమ యేను నచనరచనలు బోధింపవలదు నీకుఁ
దోడనే మించి సహజమాధురులునించు। నించు మొక్కుఁ బాలెత్తి పెంచవలెనె 22

తే॥ పూనుకార్యము సశిఖరగ్రైనదనుక । నిల్పియాలస్యమొనరింపనీతిగాదు
బంతియొగవైచి నెరిదప్పబాడియగునె । యొసటఁ బ్రాలిడి ముచ్చట కేగదగునె 23

వ॥ అనినవినియక్రూరంబుసర్వంబు నెరింగించి ద్వారకాభిముఖంబుగఁ జనియె
నంతనిక్కడ 24

చం॥ తొలఁగని వేడ్కఁ బద్మినులతో గతులన్ విహరించినట్టి పే
రలయిక దీర నబ్ధిని సహస్రకరుండు తటాలునన్ జవా
త్యలఘుత(గు)ంకె నెంతయుఁ దగబ్ధిబహిఃప్లుతమైన బాడబా
నలమని తోఁచ లోకనయనంబులకున్ నెరసంజపుంజముల్ 25

తే॥ ఆకసంబంత వితరణిరైయె సమృద్ధి । తమము నైనెయొప్పి విహితభాక్రమతనుండఁ
నిజకళాస్ఫూర్తియంతయు నెరవుకొనుచు । నెసఁగు ద్విజరాజమండలం బేసుదించె 26

మ॥ చెలువైయంబుధిఁ గూలపాళియలయిం చెంగొమ్మతాపాగ్నివా
దులకుం బట్టఁగవచ్చె సంజయనునత్తోరంపుటొర్వంబు త

ద్గళదుల్కావృతధూమమొచ్చెనుడుయుగ్ధ్వాంతాఖ్యఁ దద్ధాటికా
కలనల్ మాని శశాంకుఁడై యెదుట నే కన్పట్టెనయ్యబ్జుఁడున్ 27

ఉ॥ ఉదయగిరీంద్ర దుర్గముననుండి మహోద్ధతచక్రిశక్తి నె
మ్మదినిడిరాఁగఁ దారకసమాజము మీరఁగ రాజుఁ గాంచి క
ట్టెదుట విభిజ్ఞతంగువలయేశ్వరవర్గము నీలవస్త్రముల్
పదపడి చించి వైచుగతిఁ బాయలు వాసెఁ దమిస్రసంఘముల్ :8

ఉ॥ ఆయత ఫేనపుంజవసనాంచలమెత్తి మహోర్మి బాహులన్
గాయజుఁ గూడి పాంథులను గాసిలఁ జేయుటనీతి గాదు రా
రా యటు బోక శీతలకరా యని కూయిడురీతి నెంతయున్
మ్రోయుచుఁ బొంగెనంతట సముద్రుఁ డముద్రితవారిపూరుఁడై 29

వ॥ అంత 30

కం॥ వెన్నెలవడఁదాఁకెడుగతి । నున్నదిఁగుని సన్నుతింపనొగిఁడ విలెనన్
గన్నియ చెన్నగుపున్నమ । వెన్నెలవడఁదాఁకెనపుడు విన్నఁ దనమునన్ 31

వ॥ అప్పుడు పరిచరవనితాజనంబు తత్కన్యకై నిర్దయుండై పరితపింపజేయు
చంద్రుని వేడం దలంచి 32

సీ॥ పూని భువనరాశిలోన శ్రీరామానుజాఖ్య సన్నుతిఁ బొందనవతరించి
సుస్థిరామరులకచ్చుపడంగ విమలస్వరూపకళాదానరూఢిఁ జూపి
చక్రాబ్జిత పనంబు సవరించి యెంతయు సరసులకు ముదముల్ చక్కఁ జేసి
మగఁటిమి నాశంకర గురుకోటిరోన్నతులఁ గళామాత్రఁ గ్రిందుగ నొనర్చి
యాదరింపుచునాత్మపాదామృతమునఁ । దవిలి జీవులప్రచుర సంతాపమడఁచి
యలరితివియంచు నార్యాళి యభినుతించె । సేవ్యగణాసంగముని రాజుఁ జేరియపుడు 33

వ॥ అంతలక్ష్మణాకన్యయిట్లనియె 34

మ॥ ధరలోనన్ ద్విజరాజనామమున సత్సంగంబునం సత్కళా
నిరతిన్ మించియు నుత్పలప్రియుఁడనన్ నిత్యంబు రాజీవసం
హారణంబు కర్కరజాలముల్ సొనిపి సేయంబూను నీచంద్రుఁడో
తరుణీవీనికి నెంత జేసిన దయాదాక్షిణ్యముల్ గల్గునే 35

చం॥ చెలులను తెప్పలన్ విరహసింధువులీఁదెడుమమ్ము బోటులన్
జలమునమి్రింగుతోయనిధిసంభవు వీనిని జూచి పద్మజుం
డలికచలార యాహిమకరాఖ్య తగన్ మకరోహియన్న మేల్
తలఁపునఁబెట్టె నట్టినయతత్త్వవివేకికి మేలుగావుతన్ 36

తే॥ వేమరో "కర్మణైవప్రలీయతే" య । టన్నది నిజంబు రాత్రి మహాబిలమున
బలియుఁడై పాంథజాతరూపముహరించి । శ్వేతకరుఁడయ్యె నీయంబుజాతవైరి

వ॥ ఇట్లనేకవిధంబులనయ్యరవిందాక్షి యిందునిందనసందర్భంబు లొనరింపుచుఁ
దన్నిశోపద్రవంబుగడుపుచుండెనంత 38

శా॥ జోకన్ వీడ్కొనిచక్కొరేఁగెనుజామీ శుభ్రాంశుబింబప్రభో
త్సేకంబుల్ దరిగెన్ జామీ కడకువచ్చెన్ జామ్మి యీరేయి చిం
తాకాలుష్యముతేలబాలమదిలోధైర్యంబవార్యంబుగాఁ
గోకోయన్నగతిఁ గుక్కుటంబులరచెన్ గోకోవిరావాగ్భటిన్ 39

సీ॥ కుముదినీవల్లికాసమితికిజోకొట్టు తలఁగుజక్కవలసంధానకర్త
సెత్తమ్మికల్కికన్నియకువేడుకకాఁడు రతినాథజనకుని రచ్చగద్దె
చంద్రికాపాయుకంచంబులోపలిరాయి కౌశికావళికిఁగన్మూసిగంత
సంతమసములకుచ్చాటనమంత్రంబు భువనంబువారియుప్పొంగుగన్ను
జారిణులకాలిసంకెల జనగణాక్షి । పుటసమీక్షణములపాలిపుణ్యతీర్థ
మరుణుఁడుదయించెనరుణాత్మకిరణుఁడగుచుఁ । బూర్వభూధరశేఖరాభోగమునను

చం॥ క్రమమునమిత్రమండల మఖండితపండితధామభూమచేఁ
గొమరువహించెఁ బూర్వగిరికూటమహోన్నతపీఠవాసియై
యమరకులాధినాథసముదంచితపట్టణసౌధపాళిపై
నమరెడుకుందనంపుగడియారపుగంటయనంగ నెంతయున్ 41

వ॥ అంతసంతాపమూర్ప నీడయగు నొక్కప్రౌఢ పెద్దయుంబ్రొద్దు పరితపించిన
యమ్ముద్దియకుఁ జంద్రాస్తమయమహాసంతోషవార్తవిన్నవించినఁ దదాలింగనంబు పా
రితోషికంబుగాలభించి నమ్మికతో నంతనంతఃపురంబు వెషలఁదోతెంచి చెంగటనుసంగు
నఖంగకురంగాంకమణివేదికోత్సంగంబున నధివసింపంజేసి మరియును. 42

చ॥ మగుడక యశ్రుపూరముఖమజ్జనమాఁగి సుగంధవారిచే
మగువయొకర్తొనర్చె ముఖమార్జనమున్ ముడిగట్టెయొక్కఁతుక్
మొగమున వ్రేలుముంగురులు మొల్లపుబొట్టెడలించియింతికిన్
ధగధగలీనుబొట్టొకతె దిద్దె బళీయనఁ బచ్చికస్తురిన్ 43

వ॥ అప్పుడు 44

సీ॥ కొమ్మపల్కెడు వలయంబులుగొమ్మంచు నెదయందువలయమ్ములిడియెమరుఁడు
నీలోర్మికలుచాలఁ గీలించెదుమరుండుకంటను నీలోర్మికలుఘటించె
వలదుముక్తాహారకలన నాలుకనె యంగజుఁడు ముక్తాహారకలనగూర్చె
నందియలాననవ్వెమె మన్మథుఁడువెన్నునందె తా నందియలానఁదార్చె
వింతసింగారమిప్పుడో వెలదినాకు । గలిగెనిఁక నీవు సేయుసింగారమెపుడు
నున్నదియె కాదెయనుచునక్కన్నె చెలులఁ । గ్రమ్మఱింపుచు ధైర్యంబు గ్రుమ్మరించు

సీ॥ గంధమా యిట్టిలాగంధమా యుత్తరిగంధమా యిది యంగకములనలఁద
వీడెమా యాప్రేమవీడెమానిని మాన వీడెమన్మథవేధ కెన్నొకటి
కప్పురమా మూర్ఛగప్పురమాజాని గప్పురమానంగఁ గల్గుదనుక
దండలాడఁగదీరదండలా యివి మానదండలాంఛనములై మెండుకొనియె
ననుచుఁ గడునుస్సురని యెడయడరనూర్చి । యువిదకన్నీరుగ్రుక్కుఁదన్నుపచరించు
దిట్టచెలులెల్ల మగనిపైనొట్టువెట్ట । గడగడవడంకి యిసుమంతగడువలేక 46

వ॥ ఇవ్విధంబున మన్మథవేదనం గృశింపుచు నొక్కనాఁడు 47

తే॥ బోటులనొకింతతనుఁబాసిపోనికూర్మి । బోటులమొఱంగి తెకతెకఁ బొక్కిపడెడు
నొంటి వలరాచకింకకునోర్వలేక । నొంటిఁజని మదిసాహసంబూనిపూని 48

మ॥ చెలి యారామముఁజేరి ప్రొద్దుగడుపం జింతించి కంసారిపైఁ
గలగీతంబులు పాడఁ జాగియపుడుం గన్నీటిమున్నీటిలోఁ
బలవంతంబగువీణెకాయలపసన్ బైఁదేలఁబుష్పేచ్ఛ శా
ఖల మున్నెక్కప్రియాళిఁ దా దిగిచె దీర్ఘస్వోత్తరీయంబునన్ 49

వ॥ అంత 50

తే॥ నెచ్చెలులుగొంద ఱరసి యన్నింట నింట । బొలఁగానక విద్రుమపంజరమున

నున్ననున్ననిజిగిచిల్కవిన్నవించు । వలన వలనంది యటఁబోయి వనితఁగాంచి 51

సీ॥ పంచబాణుఁడుమండిపడు జందురుఁడు చాలహెచ్చితండ్రికిఁ బోటుదెచ్చునెపుడు
తురకంబుఁ జైత్రుఁ డేమఱఁడు గంధపుఁగొండగాలి విగ్రహబద్ధకంకణుండు
కోయిలల్ పంచమగుణముపీడవు మూకఁగూడి చిల్కలు పండ్లుగొఱుకుచుండు
నళిసమూహమ్ము రంధ్రాన్వేషణముసేయుఁ బేర్చి యీవనవాటి పెచ్చుపెరుగు
నిందఱికి నిట్లు నీమర్మ మెఱుకపడఁగఁ । దొడరి బయలేలవెల్లితో తొంగియున్న
సుంకరీ! తలమూటకుసుంకమెంత । యనుట యిట్లమ్మ చెలి మోసమగుఁ గదమ్మ

ఉ॥ ఈతటి నీదు ముక్కు మొగమింతయుఁజూడక గంధబంధురం
బై తెగి యేఁచుఁజంపకము లంబుజముల్ తమి నుబ్బు నుత్పల
వ్రాత మెదిర్చి పేర్చుఁ బెనువంతలు నీకసుఁగాయకే మహో
త్పాతపుఁదేంట్లు నల్గుఁ జెలి! తథ్యము నీతలఁ జూపకెంతయున్ 53

కం॥ ఇచ్చటమ్మ్రుదుబిసఖండము । లిచ్చటఁ దినవంచగమికి నిది సమదంబౌ
ముచ్చటయంతయు నేలా । ముచ్చట విరహిణులమానమున కోతరుణీ! 54

కం॥ అల మధుపాదులదోసమె । తలకొను సుమనోగణంబు దానికి నిచటన్
వలదుపద సాధు రేగినఁ । దలపొలమున నుండరాదు తామరసాక్షీ! 55

వ॥ అనియిట్లుదూరిన బెట్టిదంబగునిట్టూర్పునిగుడించి 66

కం॥ మాటకుమాటకుసంతత । మాటకుఁ బెట్టుదురుసకియ లని మిమువిడి యా
పాటలసురభితవనిఁబతి । పాటలఁ బ్రొద్దుచ్చఁజెందఁబడెఁ జెలులారా! 57

వ॥ అనిపల్కి వారితోడఁగూడుకొని 58

సీ॥ అంకజోర్మిస్థలత్పంకజోత్కరములఁ దేఱిచూచి మొగంబుఁ ద్రిప్పిత్రిప్పి
సవలయక్రమచలత్కువలయాచ్ఛచ్ఛదశ్రీఁ గాంచి కన్నెఱ్ఱఁజేసిచేసి
కంపకాంతనవీనచంపకార్గళనూనవిసరముల్ గని ముక్కువిఱిచివిఱిచి
ఫుల్లవాతోద్ధూతపల్లవాటోపముల్ వివరించి మిగులఁ జేవీచివీచి
మగువ చగ్రగతులు మావులు పున్నాగ । ములును మధుపతతులు మొనయువనము
డింపవెడలెను "శకటంపంచమాస్తేన" । యనెడువచనమరయ నర్థముగద? 59

వ॥ ఇట్లు శృంగారవనంబు వెడలి సుందరి నిజమందిరంబుఁ జేరి సఖులు శిశిరోప
చారంబులు సేయుచుండ శుకాగమనప్రతీక్షాపరాయణయై యున్న సమయంబున 60

చ॥ శుక మరుణప్రభాపటలశోభితవక్త్రపుటాభిభూతకిం
శుక మతిచిత్రపత్రపరిశోభితవృత్రవిరోధికార్ముకాం
శుక మసదృక్షమంజులవచోలహరీపరతంత్రకాంచనాం
శుక మరుదెంచినిల్చెఁ గడుఁజోద్యమునొంది! సఖుల్ నుతింపఁగాన్ 61

వ॥ అంత 62

సీ॥ నడుమ నాలస్యమెంతయులేక ద్వారకాపురికి రివ్వున సాగిపోతినమ్మ
పోయి క్రొన్ననసెజ్జఁ బొర్లుచు విరహాగ్నిఁ గ్రాగెడు మురవైరిఁ గంటినమ్మ
కని "మహాభాగ ! సంకల్పసిద్ధి,,యటంచు నెలమితో దీవనలిడితినమ్మ
యిడి మాలతాంగి నిన్నెదఁగోరి పూవింటిదంటచే సగమైనదంటినమ్మ
యని ప్రయాణమిటకు నపుడె యంతయు సమ । కూర్చి యతని వీడుకొంటినమ్మ
కొని ఫలించె నీదుకోరిక లని పొంగి । బాల ! యిటకు నుట్టిపడితినమ్మ 63

వ॥ అని మఱియు బహుప్రకారంబులఁ బలికిన 64

క॥ బాగుగనాలింపుచు శీ । ఘ్రాగతిశుకవదనకింశుకాంచితహరివా
ర్తాగురుమధుతర్పితహృ । ద్భాగభ్రమరేంద్రయగుచు బాలిక యుండెన్ 65

వ॥ అంత 66

సీ॥ అంగవంగకళింగ బంగాళముఖ బహుదేశ విశ్వంభరాధీశ్వరులును
లాటమరాట కర్నాటభోటావంతి భోజకాంభోజాది భూమిపతులు
చోళనేపాళ పాంచాళమాళవగౌళ కొంకణ టెంకణ క్షోణిపరులు
గాంధారసింధు యుగంధరాంధ్రకరూశ పాండ్య కేకయ మహాపాలకులును
దుంగమాతంగనివహా తురంగగణ శ । తాంగసముదయసంగరాభంగపదగ
జాతనూతనకేతన ఛ్చత్రచిత్ర । హైమపల్యంకి కాందోళికాఢ్యు లగుచు 67

క॥ వచ్చిరి యప్పురిరాజముఁ । జొచ్చిరి తన్మిత్రజనులు సువినయములతో
నిచ్చిరివిడుదులు వారికిఁ ॥ దెచ్చిరిసకలార్థములును దృఢసంప్రీతిన్ 68

సీ॥ మారాజ్ఞచే నెంచఁ దారలతో వచ్చు చంద్రుఁడై మౌక్తికచ్ఛత్ర మొప్ప

లలిఁ జేరుకొనివచ్చు లక్షణగారాబురాయంచలనఁ జామరంబులెసఁగ
మాద్రీగళము తమ్ము మదమార్ప మొరవెట్టుకరణిగా ధవళశంఖములు మ్రోయ
నిఖిలదిగ్దేశావనీపాలకుల నెల్లఁ దలఁగుమన్నట్లు కేతనముగదల
వందిమాగధగీతముల్ సందడింప । గాఢగంధాంధ సింధురారూఢుఁడగుచు
నప్పుడేతెంచె నిజచరణాబ్జభక్త । రంజనుండగు నమ్మురభంజనుండు 69

వ॥ ఇట్లు సర్వసన్నాహంబులతోఁ బురంబుఁ బ్రవేశించి భయభక్తియుక్తుండగు నారాజుచే బహూకృతుండై సుఖంబుండె నన్యరాజులును మజ్జనభోజనాద్యుపచారంబుల విశ్రమించి యంత శిబిరంబులు వెలువడి యక్కన్యాపిత్రాచరణానుసరణంబున యుగపదనంతావతారుండైన పంచబాణుని నిజమూర్తులోయన నాగరనాగరాజగమన లక్షయంబగున పేక్షాతిశయంబునవీక్షింప మూకలుమూకలై బృహత్సేనమహీవల్లభుని హజారంబునకుంజని యుందు 70

శా॥ శ్రీమంతుల్గనిరంతఃదన్నగరయోషిద్రత్నవేణిచ్ఛల
శ్యామాహీశ్వరకన్యకామణిమహస్సమ్యగ్దిదృక్షాభర
స్థేమాయాతభుజంగపుంగవుఁడనం జెన్నొందు తచ్చాప ము
ద్దామాటోపము సాక్షతప్రసవగంధప్రోల్లసద్ధూపముల్ 71

వ॥ మఱియు 72

సీ॥ చూచి ముట్టకయె సంకోచించి వెసవెసజారెఁ బరాకుగాఁ గేరళుండు
ముట్టికదల్పఁగా మురు వింతయునులేక నలుదెసల్ చూచె గాంధారనృపతి
కదలించియెత్తఁగాఁ గడునశక్తుండయి గిజగిజకుడిచె నక్కేకయుండు
ఎత్తి దాఁపలికేలహత్తించి నిల్పఁగానోపక తలవంచె హూణభర్త
నిల్పి మోపెట్టఁగాలేక నేర్పుమాలి । నారిఁ గేల్ద్రెవ్వఁబడియెఁ గర్ణాటకుండు
తివిచి మోపెట్టి శరముసంధింపలేమి । బెట్టుకిచకొట్టె నప్పుడా రట్టవిభుఁడు 73

కం॥ భీముఁడు కర్ణుఁడు కౌరవ । భూమీశుఁడు తోయమధ్యమున ఝషయంత్రం
బేమఱకచూచిచూచియు । నేమియుమఱియెఱుఁగకుఁడి రిదియెట్లనుచున్ 74

ఉ॥ ఆ సలిలప్రమేయ ఝషయంత్రము మర్మమెఱింగి యస్త్రశి
క్షానువిదగ్ధులైనవిలుకాండ్రకు మేటి కిరీటినూటిగా
నేసినకోల దాని కొకయించుక చేరి కదల్పి ఖండముల్
చేసియెసంగలేక తనచిత్తముఁ జేసె నఖండఖండిమన్ 75

వ॥ అప్పుడు సింహగమనవిలాసమునం జనుదెంచి కోదండంబు హస్తదండంబునం ధరించి.

ఉ॥ బంగరుదుప్పటంబు వలెవాటుగ నొప్ప హసన్ముఖాబ్జుఁడై
రింగున నారిగోలసవరించి తటాలున నుద్రుంచె నాధను
శ్చంగుఁడు గోపయావతభుజంగుఁడు మోచితసంగుఁడుం గృపా
పాంగుఁడు దృప్తదర్పభరభంజనమంత్రము మత్స్యయంత్రమున్ 77

ఉ॥ భోరున దుందుభుల్ మొరసెఁ బుష్పమయంబగు వర్ష మంతటన్
జోరున వెల్లిగాఁ గురిసె శోభనసౌరభరాజమానమై
డాఁగున నచ్ఛపీచె సముదార సుశీర సమీరపోతముల్
హోరన సన్నుతించె నపు డుర్విజనాళి తదీయశౌర్యముల్ 78

సీ॥ అలికరేఖారంజనార్ధ వేధఃక్లుప్త కోమలాంజనమయ గుళికలనఁగ
రంగ దురోజరథాంగపుంగవ సముత్కుంచిత ఘన గరుత్కోటియనఁగఁ
జరణద్వయీప్రోక్త తరుణాబ్జతల్లజ పల్లవాక్షేపణార్భటికయనఁగ
సాక్షాత్కృతానంగచారుమోహనశక్తి పరిణత యువ కంఠపాశమనఁగఁ
గర్ణకువలయలోలభృంగములు తాళ। వృంతపవనచలోత్తరీయాంత మంఘ్రి
కటకరవములు హస్త సంగ్రథితమాల। చెలగ నేతెంచె లక్షణ చెలులతోడ 79

సీ॥ శార్వరీతరుణి నక్షత్రమాలికచేత శీతమయూఖుఁ గైసేసినట్లు
గంగ పాండురతరంగంబుచే నాపగాధీశున కొకవన్నెఁ దెచ్చినట్లు
మధుసంపద లతాంతమంజరిచే ధరిత్రీజమాళి నలంకరించినట్లు
ప్రాతస్సమయలక్ష్మి భానుచ్ఛవిచ్ఛట నుదయాద్రి కొకశోభ యొసఁగినట్లు
బాలికామణి యవ్వనమాలి కంఠ। భాగమలరించె మహితానురాగమొప్ప
లోకజనగణ గురుతరాలోకములకు। భ్రామకంబగు నమ్మణిదామకమున 80

ఉ॥ చందనగంధి వెక్కసపుఁజన్నులచెన్నుఁ బిఱుందుపొందుఁ గా
నందముఁ జూచి కొండఁగొనిన ట్లఖిలావని యేలురీతి మి
న్నందిన భంగి నంచుకుతుఁ డందె నమందతరాతినిర్మలా
నతదేహమున్నతోర్మి భృగునందన వామను లైన తత్ప్రతిజ్ఞ 81

వ॥ అంతటఁ బరమానందభరిత నిజస్వాంతుండగు బృహత్సేన మహీకాంతుండు మౌహూర్తికప్రకాశిత తాత్కాలిక వివాహముహూర్తుండై తన్ముహూర్తంబు నిజపురోహితవర్గంబుచేఁ గృష్ణునకెఱింగించి పుత్రసహితుండై నిజమందిరంబునకుం జని యొనంత; గృష్ణుండును సకలజనజేగీయమానుండై నిజ శిబిరంబుఁ బ్రవేశించి నిజామాత్యవర్గంబునకు బ్రాహ్మణసమారాధన ప్రయత్నంబుఁ గావింప నియోగించి పురోహితప్రేరేపణంబున మంగళస్నాన సన్నద్ధుండయ్యె నప్పుడు. 82

సీ॥ అంగసంభవుఁడు చన్బొంగరంబులచుట్టు నిడు జాలెలన సరుల్ మునివడంగఁ
గటకతాళ కుచోరునటన మెచ్చినలీల వెడఁద వేనలి పుష్పవృష్టి గురియ
వడవడమను కానుజడుపుఁ దీర్చెడు భంగి మొలనూలిచిఱుగంట లలరిపలుక
మార్పాతావికిఁ జొక్కి యొరఁగు తేంట్లనఁగ ముంగురులు చెమ్మటనొసల్ గూడనంట
నమర శిరసంటె నొక్క ప్రాయశ్శిరోజ, యొకళనైర్మ్యాన గంధా మలకము వెట్టెఁ
గించిదనలగ్న యొకతె యర్పించె జలక, మొక్క యుష్ణచర్చితంబతళ్ళొత్తె హరికి 83

తే॥ జిలుఁగుమడుగులు సిరిగందమలరుదండ, లోరఫుమానికములసొమ్ము లొసఁగి ఫాల
ఫలకతలమున మృగమదతిలక మలర, దిద్ది ముందర నిడెనిల్వుటద్ద మొకతె 84

శా॥ భ్రూరేఖోజ్వలనాసికాపుటముతోఁ బొంకంపు కస్తూరిబొ
ట్టారూఢిం జవరాండ్రఁ గుమ్మ మదనుండార్జించు మేల్బంతి పో
లెఁ రాజిల్లఁగ వక్షసి దైత్యమథనుం డద్దంబులోఁ గాంచి యా
సైరంధ్రీమణి వ్రేలికిచ్చె మణి విస్ఫారోర్మికారాజముల్ 85

వ॥ ఇవ్విధంబునం బుండరీకనయనుం డలంకృతుండై నీరాజనంబవధరించి పళ్యజ్జన నయనానందసంపాదియగు నొక్క వేదికకుఁ జని మేరుశిఖరిశిఖర శాసనంబగు కనకాసనంబునధిష్ఠించి తత్కాలోచితవిధినుండె నప్పుడు. 86

సీ॥ ఒగిఁ దేనెతోనలిడ నొజ్జలకివిదర్భ పీఠంబులని చంకఁ బెట్టువారు
వరుస మండెంగలు వడ్డింప జపతి త్రిమడతలోయని విప్పఁగడఁగువారు
వడలు వెట్టిన వ్రేలనిడి యొంతిలేసిజందెలబిళ్ళలటంచుఁ ద్రిప్పువారు
పోక పేరులోసంగఁ బొంకపుఁ జపమాత్రవలయంబులని మెడ వైచువారు
నగుచు మారిశోభనమోఁజాడనరుగుదెంచు, మునివరులయొద్దివేశేలమును దళిష్యు
లంకఁబుభుజించిరి చతుర్విధాన్నములను, వేడ్కలుప్పొంగ వెన్నునివిడిదిలోన 87

వ॥ ఇట్లుభుజించినవారల గంధపుష్పాక్షతతాంబూలంబులం బరితృప్తులఁగావిం
చి వారలయాశీర్వాదాక్షతంబులు గైకొని యా నందనందనుం డమందానందంబున శ్వ
శురప్రేషితభావుకప్రేరితుండై నిజవివాహాగాసహాసంబునంజనుదెంచు దెలిదీవియనవొ
ప్పు వజ్రరథంబెక్కి నిజకన్యకాపరిణయదుర్ణయకలుషితాంతరంగతరంగిణీవల్లభప్రేషితు
లై చనుదెంచి చెంగటమెలంగు మంగళపాఠకుల సంగీతప్రసంగభంగీసౌభాగ్యంబు లా
కర్ణించియునట న్నటీపటీరగంధి తటిద్వల్లికామతల్లికాభినవప్రభావిభవంబు లభివీక్షించి
యు శేషవంశతాప్రయుక్తవచనకౌశలంబున నైసర్గికపరుషరవంబున నఘంబును భ
యంబును జూపుటమఱచి యపారపారవశ్యంబున శిరఃకంపంబును మందగమనంబునుం
బొందిన భుజంగిపుంగవులును జీమూతసార్వభౌములనం బనుపడిన పటుతరధ్వజంబులు
ను దనకు మక్కువమగండగు నక్కమలాక్షుం డొక్కమొగిఁ బెక్కుచెలులకు నక్క
జంబుగాఁజొక్కి తను లెక్కసేయండని యుల్లంబగిలి మిగులం బొగలుపుడమిపూఁబోఁ
డి మేనివేఁడిమింబోలె మిట్టిపడినట్టు కొట్టక చౌపట్టంబులుద్రొక్కు నారట్టసాయం
బులును నాగరనాగ రాజితగండమండలా మందనిష్యందమాన మానిత దానపయఃపూ
రనిర్వాపణకుల్యాకార సాకల్యాకల్య నేమిరేఖాపాతకంబులగు రథంబులును నిగనిగలు
దేరు తన్నగరిమగువల నగుమొగంబులకు గొప్పలై యొప్పు నమృతపుఁగుప్పె లప్పనలు
గాఁగొని యొప్పింప నేతెంచు చంద్రమండలంబులో యన నబ్బురంబగు ధవళచ్ఛత్రంబు
లును, ననవద్యహృద్యవాద్యఘోషాతిశయబధిరీభూతులై చేష్టావిశేషంబుల నేపథ్యం
బులువైచి మేడలపై దర్శనక్రీడలనున్న ప్రోడచేడియల నిడువాలుచూపులు మణితో
రణంబులని పుటంబోసి యందుకొనం గమకించువీరభటులును, జెలంగ మందమందగమ
నంబున రాజమార్గంబున నేగి యేగి రథంబుడిగ్గి మణిపాదుకలఁ ధరించి రాజముఖ్యద
త్త నీరాజనపూర్వకంబుగాఁ జంద్రశాలాకదంబితచందిరంబగు తద్రాజమందిరంబుఁ బ్రవే
శించి శుభాలంకారంబులప్రోదియగు వివాహవేదిం జేరి యుభయపార్శ్వనివిష్టవేదపాఠ
కంబగు కనకపీఠంబునధిష్ఠించె నంత ౪౪

సీ॥ చికిలియైదొనసొచ్చుచిత్తజుశరమునా మంగళస్నాతయై మడుఁగుఁగట్టి
చనుఁగవమించెనాతునియుఁగౌనసురీతిఁ దగటి మేల్రవికె గుత్తముగదొడిగి
సిరిచూపినలరాజుచేఁ గనకస్నానమొందుపొందున సొమ్ములందపఱిచి
వారిఁబొందుమని మరుండంపుచీల్లనఁగ గేదంగిరేకులఁ జాలఁ దల ధరించి
నీలకబళితనవతృణలీలనలర । గన్నుఁగదనంజనము రేఖగాఁగఁ దీర్చి
బలియుజడఁద్రొక్కికొనుశంకబలెనెవచ్చె । మందగతియొప్పఁజెలులతో మద్రకన్య॥

సీ॥ సారసారెకు దంతచకచకల్ బయలెక్కి తీవి దిక్కులఁ బల్లటీలు ద్రొక్క
వీడెంపుఘుమఘుమల్ గూడినవదనగంధంబు కిప్రపు వసంతంబుఁజిల్క
నగ్గలంబగుకల్కిసిగ్గులు లోచనతోయజంబులునిండి తొంగిచూడ
రమణమాటుగనున్నరతనంపుమొగరంబు డంబుగా నవలఁ గొండెంబు సెప్ప
మంత్రసరణులతడబడ మరచినుసలి। రొజ్జబాపలు నాలింపఁ బజ్జఁజేరి
కంచుగీసినతెఱఁగున ఖంగురనఁగఁ। జేడియలుగూడి ధవళముల్ బాడుచుండ 90

కం॥ మధుపర్కపూర్వకముగా। మధుహల్లకభల్లకోపమానుండగు న
మ్మధుమధనునకర్పించెను। మధురాధర నవనిపాలమండనుఁ డంతన్ 91

సీ॥ చనుఁజక్కవలను నిశ్చలమైత్రిఁజూడంగ వ్రాలినహేళినాఁ డాళిఁగట్టెఁ
ఎనుక మేర్పడఁగందుతరుణీధరణిఁజిక్కి బలునుబ్బునాఁ దలబ్రాలొసంగె
నింతితోడను గంతుఁజేచినముచ్చటల్ జెప్పెడుభంగిగాఁ జెట్టఁబట్టెఁ
గుంభిని నీకాలిగోరుఁబోలఁగ లేరుపడతులన్నతి సప్తపదములాసె
వీరపానంబుచేగారవించి హృద్గ। తాత్మభవవహ్నికిం బ్రతియనుపుకరణి
నాజ్యముఖహవ్యములఁ వేల్చి యంత వహ్ని। నాత్మనారోపణముఁజేసె నచ్యుతుండు

వ॥ అప్పుడు సంతుష్టనిజస్వాంతుండగుబృహత్సేనమహీకాంతుం డల్లుండగు వల్ల వీవల్లభున కనేకదివ్యాంబరమణిభూషణాదికంబు లరణంబులుగానర్పించి యసాధారణంబుగా మఱియును. 93

లయగ్రాహి

తుంగము గళన్మదతరంగము కపోలచలభృంగము హతారిచతురంగమునుగాఢ
భ్రాంగము జవానిలకురంగము మహానటనచంగము జితోగ్రగరణరంగమునుగా ని
ర్భంగము ధ్వజోన్నతపతంగము సకార్ముకనిషంగము లటిచ్ఛయపిశంగమునుగా మా
తంగమును బారసితురంగమునుఁ గాంచనశతాంగమును శౌరికినొసంగెన్నపుడంతన్

క॥ ప్రియమొప్పారఁగ నక్కేకయమనోహ్వన్మండలంబున్ బిరే
శయరాట్కుండలమున్ సుఖాప్తి మరపింపంజాలునా నిచ్చె సెం
తయు వేశాండముతై ధగద్ధగలు చిందన్ గెంపుతాఁ బేటి గ
ద్దియయున్ దంతపురచ్ఛబల్లియు ధరాధీశుండు దైత్యారికిన్ 95

వ. అట్లు బహూకరించి. 96

కం. అల్గని రుచిజితసుమనో । భల్లునిదోర్దండచండబలహతమధురా
మల్లుని ప్రణమన్మిత్రా । భిల్లునిఁ దనచిన్నకూర్మిబిడ్డను బంచెన్ 97

వ. అంత.

ఉ. నందితుఁడౌచుఁ గంజనయనామణిఁ దోడ్కొని హీరపూరిత
స్యందనమెక్కి యొత్తె హరి శంఖము తారగిరీంద్రలోచనా
నందనటత్తటిద్ఘనఘనాఘనపోతము గర్జజాడఁ జె
న్పొందినయట్లు నాగరు లహోయని యెంతయు సంస్తుతింపఁగన్. 98

ఉ॥ ఇత్తటి రాజపుంగవుల మిందఱు నేరనియొక్క నేర్పుచే
సత్తుగయంత్రమేసి యులజవ్వనిఁ గైకొని శౌరివాఁడె దా
నుత్తమకీర్తి వేగ నిపు డుద్ధతిఁ గో నరికట్టవేని సీ
మెత్తన యౌను దీవు నమేయ యశం బగు నంచు నీర్ష్యచేన్. 99

తే॥ ఒగిమహావని వరపతంగోత్కరంబు। కృష్ణవర్త్మానుగమనమై కేరి తెనప్పు
డొగిమహావని వరపతంగోత్కరంబు కృష్ణవర్త్మానుగమనమై కెరలినట్లు. 100

సీ॥ కాంభోజగణమెల్లఁ గాంభోజగణమయ్యె యదుకుంజరుం డేచి పొదలుచుండ
నామరాటుండు దా నామరాటుండయ్యె నెదురుపోటునఁ గృష్ణుఁ డదననొంప
మాలవుండప్పుడు మాలవుండయ్యెను వెన్నునిబలమొంచి విన్ననగుచుఁ
దలఁకివిదేహుండు తా విదేహుండయ్యె హరి వాలు జళిపించినదియుఁ జూచి
సింధులందఱు కటకటా! సింధులైరి । క్రొత్తనిజదేహరక్తముల్ కెరలిపారఁ
దాళఁగాలేక చోళులు చోళులైరి । యడవిఁ బ్రచ్ఛన్నవృత్తిఁ దామధివసించి. 101

చ॥ హరికరవాలజాలనిహతాహత రక్తఝరీకదంబముల్
కరివరకైతవాంబుదనికాయగళన్మదవృష్టిఁ బొంగ వే
యరిగెలఁ బుట్టుగాఁగ నదియమ్మొయి బల్లెపుఁ ద్రెడ్డులూని త
త్తరణముఁ జేసి శేషవసుధావరవర్గము వారె భీతిచేన్ 102

శా॥ ఛేద్యుద్దామతరాస్థికంటకిత నాభీదఘ్న మేదోమయ

ప్రోద్యత్కర్దమదుర్గమాజిసరణిం బోలేక తద్భూచరుల్
వ్యృగ్యం బామర మంద్రు మింటఁ బటుఘోటీంధాన రింఖాకృతా
చ్ఛేదోర్వీరజమెచ్చఁగా ననిమిషుల్ చెల్వొంద్రు మర్త్యత్వముల్. 103

సీ॥ శస్త్రారిమస్తక ప్రస్తదీర్ఘోక్షిప్తపటలముల్ బంతిచాపలుగ వైచి
సంభిన్నరిపుకుంభికుంభముక్తామణి పారంపగలఁ బీటపట్లు పెట్టి
నిర్మాలితద్విపన్నిర్మలాయతచర్మఫలకముల్ పళ్లెరంబులుగనిలిపి
యాలూనవైరిభూపాలకపాలముల్ చేగిన్నియలుగ నచ్చొంతనునిచి
మించిమాంసంపువిందు వడ్డించెనపుడు । డాకినీశాకినీభూత లోకములకుఁ
జటులశాతకృపాణియల్ జలజపాణి । పేర్మినాశౌరి రణలక్ష్మిఁ బెండ్లియాడ. 104

వ॥ ఇవ్విధంబున నతిఘోరంబగు యుద్ధరంగంబునఁగుంభినీరమణాకారులైన కుంభినీరమ
ణుల వారి వారింబోలి నిరసించి ద్వారకాభిముఖుండై చనిచని 105

సీ॥ భానుభాను ప్రతిబంధిశాఖా శిఖోత్కరముచే నధ్వగాంసంకరణము
కరికరాగ్రోద్ధూతకర్పూరతరురజస్తతిచే సురీపలితంకరణము
ఖగవేగవిహగసంక్రాంతాబ్దగళితముక్తాళిచే వనచరాఢ్యంకరణము
శరభార్తసింహగర్జాప్రతిధ్వనులచే గ్రావమహోసుభగంకరణము
నై సువిక్రాంతసంకుమదాభిలిప్త । తతభిదాత్తవవేణు ముక్తాఫలోద్ధ
రంగవల్లికమార్గాభిరామమైన । ఘనతరారణ్య మొక్కటిఁ గనియెశౌరి. 106

ఉ॥ తాళక యేసినన్ స్వముఖతామరసంబుల కాశశాంకునిన్
బోలిక చేసి హెచ్చు సరిపుచ్చెదరోయని కాని పూనిరే
యేలికజింకనైన నొకయేటున నే పడనేయ నేర్తు రు
ద్వేలచమత్క్రియాకలన హెచ్చఁ జరించుపుళిందసుందరుల్. 107

కం॥ వవవవమను వెమ్మెములు । రివరివమను మద్యములు ద్విరేభశ్రేణుల్
జవజవమను వేణికి చుది । రవరవమను మరుఁదు వారిరంగులు గనినన్. 108

సీ॥ చిటుకనగొడలాడ విటుతురు పెళ్ళున గజదంత మొకకేలఁగరముఁబట్టి
రహిఁ గూఁతలిడ బొంగరపుజాలెకై త్రొక్కి పెటుకుదుటు మృగేంద్రభీమసటలు
ఘంటంబుతోఁ జాళిబానతిర్లకునంచు బెబ్బులితిత్తులురబ్బురముగ

ధృతి నీలకొట్టాము తెరకుఁ దెత్తురు గుంటగండభేరుండముఁ జెండి తెక్క
యావులాటకు ఘనవరాహములఁ బట్టి । కొమ్ములటుఁ ద్రుంచి పగులంగ గ్రుద్దివాని
గొప్పముత్తెములెల్లఁ గైకొందురందుఁ । జెంచుకుఱ్ఱలసాహసం బెంచఁ దరమె 110

గీ॥ అట్టివిపినంబు కడుచిత్ర మనుచు వెడలి । కమలదళలోచనుండంతఁ గతిపయప్ర
యాణముల ద్వారవతిచేర నరుగుదెంచె । సర్వసన్నాహసముదితోత్సాహుఁడగుచు

చ॥ జలనిధి డాఁగియున్న గిరిసంఘముఁ జూడఁగవచ్చు వెండిగు
బ్బలిపయి విద్రుమంపులతవారుతమాలమురీతి వజ్రకం
దళములఁ దేరు తేరిపయి తామరసేక్షణుఁ గూడి శౌరి దా
నలరఁగ నప్పురింగలలతాంగులు సంభృతసంభ్రమాత్మలై 112

ఉ॥ ధావన మొప్ప నొర్తు మురదండనుఁ జూడఁ జనంగఁ గొప్పపైన్
గ్రేవల రాలి చెంగలువరేకులు తేఁటులఁగూడి యొప్పె నా
త్రోవ ననేకయానతరతుండయి తన్నడ సేయుశౌరిపై
సేవలు పాటి యల్గినమహీసతిపాటలితాక్షులో యనన్ 113

ఉ॥ ఇందఱఁ బెండ్లియాడ నపుడెంతయు డెందము నిండియుండు గో
విందుని కన్నరీతి ముడివీడినకుర్లొక కేలుఁదమ్మిచే
ముందరికాని యొక్కటఁ బ్రముగ్ధచలత్కుచపాళి నాఁగుచున్
సుందరి యొక్కె నొర్తుహరిఁ జూడఁగఁ గాంచనసౌధవీధికన్ 114

ఉ॥ కస్తురముప్పతిల్లు సిరిగందమలంది యలంది గందపున్
జిప్పరయుఁదాను నేగనొకచేడియవీడక వేడుకల్ మదిన్
జిప్పలముంచి యెత్తి యదుసింహముఖేందునిచంద్రికారసం
బొప్పఁగఁ జారుచారునయనోరుచకోరుల కన్నతీరునన్ 115

ఉ॥ సింగటనున్నయూడిగపుఁ జేడియ చుట్టెయొసంగునాకు పా
ణిం గదియించి నాసపయి నిల్పె నిజాంగుళియొర్తు శార్ఙ్గిన
ర్ఘిం కను నాగవల్లి శుభదేవత సాక్షి యథార్థ మీమహా
మంగళమూర్తి యొక్కఁడు సమస్తజగంబుల కాఢ్యుఁడన్నటన్ 116

చ॥ ఎలమిగఁ జిన్నవాఁడితను నెత్తుక ముద్దొనరించువ్రేఁతమూఁ
కలజిగిమోవిచన్నులును గంటుదుగాయలు లక్కఁ దొంటపం
దులఁగ నొనర్చి యాడినఘనుం డిపు డెందఱిసైనఁ బెండ్లియై
పొలుపగు టేమి? యంచు నొకప్రౌఢ నగించె సఖీజనంబులన్ 117

గీ॥ శ్రుతిలసత్స్వరనోత్కృత్త శుద్ధభూతి । తారకాంశుకయగుచు నెంతయు వినీల
వేణ్యుపశ్లిష్టకృష్ణోపవేశకేళి । నందదే జననేత్రాళి? యనిమిషతలు 118

వ॥ ఇట్లు పురంబు ప్రవేశించి గతపురంధ్రీలోకాలోకరోలంబకదంబకాగణ్య పణ్యామ
రందసందోహప్రధానకళాధురంధరముఖారవిందుండై మందగమనంబున రాజమార్గం
బునం జని చని. 119

ఉ॥ గౌరవమొప్ప నాత్మజనకప్రథలోఁడఁ జెలంగునానతాం
భోరుహమండలంబునకుఁ బూర్ణశశాంకముఖీప్రయుక్తహా
నారతి పేరఁ గల్గినహుతాశిప్రదక్షిణ మాచరింపఁగా
సారసపత్రలోచనుఁడు చయ్యన నాత్మగృహప్రవిష్టుఁడై 120

క॥ పెండిలికొమార్తెతో మురఖండనుఁ డత్యంతవినయకలితాత్మకుఁడై
దండ మిడె వృద్ధబాంధవమండలి కెలువేల్పులకును మహితప్రీతిన్ 121

వ॥ అంత. 122

సీ॥ ఓష్ఠపుటనికుంచనోత్కుంచనములచేఁ గుండలంబులొకింతగునిసియాడ
నూర్పులబలిమిచే నుబ్బుసుక్కలనొప్పు బొజ్జలజన్నిదంబులు చలింప
నందంబుగా నుదాత్తానుదాత్తస్వరస్ఫురణంబు చేబొమల్ ఫుటముతెగయ
శ్రమవారిచేగోపిచందనంబునఁ బెట్టుఫాలోర్ధ్వపుండ్రముల్ పదనుగొనఁగ
ఘననిరర్గళగళగళత్కలరవంబు । తూర్యకోటికిమిగుల వావోడుగాఁగ
గర్గమునిముఖ్యభూసురవర్గ మపుడు । వరుసనొనరించెఁ బుణ్యాహవాచనంబు 124

సీ॥ రాజాలయరిసంహరణసముద్ధతిఁ జూచి సమదసారంగముల్ చాల నొసఁగి
విప్రవరులయనంతప్రచారగుణంబు మది నెంచి బహుతరచ్ఛదము లొసఁగి
కవిసంఘములవదగ్రథనచాతురి మెచ్చి సారసహితములౌ సరము లొసఁగి

నూతులగాంధర్వరీతిజ్ఞతలు గాంచి డంబుగా ఘనకంచుకంబు లూనఁగ
యఖిలజనులు సుఖీభవయనుచుఁ బొగడ। దానపాండిత్యమహిమలఁ దనరె నపుడు
నిజయశఃపుంజమయశంఖనికషణాంచ। దంబరాంబరుఁ డైన పీతాంబరుండు.125.

వ. ఇట్లు సకలవైభవంబులఁ గల్యాణ మవధరించి హరిసుఖంబున్న సమయంబున 126.

క. ఇంక ఘనకూపవితతులు। కొంక సరోజాకరములు కుంభిని నదులుం
డొంకఁ బయోనిధు లెంతయు। జంక నిదాఘుంబు వచ్చె సరభసవృత్తిన్.127.

సీ. హరిహైన వడదాఁకి యట్టిట్టు గాఁడె తా శీల నంబుధిఁ బవ్వళింపఁ డేని
శివుఁ డైన దూపిలి చిక్కఁడె జాహ్నవి సెలమితో శిరసావహింపఁ డేని
ధాతయైనను బెట్టు దగఁ జేత నొగలఁడె తమ్మిలో నిమ్ముగా దాఁగఁ డేని
యింద్రుఁ డైనను జాల నెదరొండి చెదరఁడే కోడెమబ్బుల నెక్కియాడఁ డేని
యనఁగ వేసవియుండెఁ జండాంశుకిరణ। దళదిలాచక్రరేఖాశతప్రసక్త
రక్తసిక్తాంత తీక్ష్ణదుద్రిక్తరత్న।భోగనిర్యాతపాతాళభోగి యగుచు. 128

చ. వనరుచు దప్పి నొప్పుచెడి వాత నొకింతయు మాటలేమిచే
ననిలుఁ డనంగ నొప్పె వ్యజనాంతనిశాంతనితాంతవాసియై
జనఘనఘర్మనిర్మలతుషారకణంబులు గ్రోలి గాలితా
ననయముఁ బొందె గంధవహుఁ డన్నసమాఖ్య మదిన్నదించుటన్. 129

వ. అప్పుడు. 130

సీ. ఘనములై రుచిఘనఘనములై శుకపికావనములౌ నుద్యానవనములందు
తరములై పరిమళోత్తరములై యానందకరములౌ నంబుజాకరములందు
వలములై మణులతావలములై గ్రహలతాంచలములౌ కేళికాచలములందు
ధనములై మదనబోధనములై యతివినూతనములౌ మణినికేతనములందు
వగ్గలపుసిగ్గు లడఁగంగ వనఁగి పెనఁగి। గొనబుజంతులు దేరంగఁ గూడియాడి
మద్రజకు నొయ్యఁదన మేను మరపి శౌరి। యలరువిలుకాని క్రీడలనలరుచుండె 131

మ. మురజిద్భక్తగిరీంద్రనిర్మథితసంపూర్ణాత్మ మేధాసుధా
సరిదీశో దితభావ్యకల్పజయశఃక్షౌమాంబరాళీనిరం

తరగుప్తావిరతోత్తరీయఘనముద్రద్రావిడీవర్ణితా
తురపాంచాలసుతావనప్రవణ గోధుక్సార్వభౌమోపమా. 132

గద్య. ఇది శ్రీమద్రామానుజ భాగినేయకుల సార్వభౌమశ్రీమన్నల్లనా
చార్యవర్య పరిచర్యాధుర్యచన్నకేశవార్యపుత్రతిరుమలాచార్య
పౌత్రగౌతమగోత్రసింహాద్రి వేంకటనామ ధే
యప్రణీతంబైన లక్షణావివాహంబను
చమత్కారమంజరికిఁ
గోరకాయితం బ
గుతృతీయాశ్వా
సము.

సంపూర్ణము.



# తప్పొప్పుల పట్టి.

—:(o):—

| పుట | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 3 | చిత్రమైయొప్పు | చిత్రిచైత్రంబు |
| | 16 | యంబారు | యంబాళు. |
| | 17 | నిశాదూరీ | న్నశాధూరీ |
| 2 | 7 | కారణంబునన్ | కాలమందునన్ |
| 3 | 2 | ఘనమౌన | ఘనమైన |
| | 5 | ఋనస్సమ్మిశ్రిత్రితాపపి | మనస్సమ్మిశ్రిత్రితాపితే |
| | 6 | శంక్యా | శంకా |
| | 15 | కాఁచన | కాంచన |
| | 23 | మహానసను | మహానస్థు |
| 4 | 2 | రయ | డయర |
| | 5 | భిదురభృద్ధురవస్థ | భిదురభీదురవస్థ |
| | 10 | త్రక-మమ్మూర్హ్యాక్షైచగా | త్రక-మనుహ్యాక్షైచరా |
| | 23 | రాజుశశంబునుజూచిచూచి | రాజశశంబులఁబారఁజూచి. |
| 5 | 14 | ఖిూరిసాంజన | నిరస్త్రాంజన |
| 6 | 9 | నిందనము | నిందకము |
| | 10 | ప్రవాహంబు | ప్రమాణంబు |
| 7 | 4 | మడగిచ్చు | మనుగిచ్చు |
| | 14 | జెలంగుసుపరసవన | జెలంగెడిసురసవన |
| | 17 | మూరంద | మరంద |
| | | తదాహారిభూరి | సదాహార్యహారి |

| | | | |
|---|---|---|---|
| | 22 | పేశేలు | పేరెముల్ |
| | 28 | జిదరఁగాఁశేరినచిరినవ్వు | జమురుగాఁజెరఁగినచిఱునవ్వు |
| | | మురవైన | మురువైన |
| 8 | 2 | బాపడ | బాపట |
| | 9 | మెరయింపుచు | మొరయింపుచు |
| | 10 | విరులులో | విగులలో |
| | 16 | నుచితముగానువర్న | నుచితసువర్ణవర్ణ |
| | 18 | కర్బురార్తి | కర్బురాప్తి |
| | 20 | మీాపద్వికసిత | మీాపద్విహసిత |
| | | దొరంగ | వొలంగ |
| | 24 | గత | తగ |
| | 25 | యున్నత | యుత్సుక |
| | 28 | సోగల | సోఁగుల |
| 9 | 5 | ఖంబులే | నఖంబులె |
| | 9 | లాగమాభ్యాసతి | లాగమాభ్యాసిత |
| | 16 | కన్గవల | కన్గొనల |
| 10 | 1 | పసక్రొమ్మెగ | పసికెమ్మొగడ |
| | 10 | దారకకాంతి | దారకాకాంతి |
| | 13 | నుబిక్కటిలిన | నంబిక్కటిలిన |
| | 18 | బోరెడు | బారెడు |
| | 19 | వలిగొను | వలిగొని |
| | 24 | రమణు | రమణ |
| | 25 | యలరులువాత్తైనసిన | యలరులఁబొత్తైనసిన |
| | 29 | వాసనలం | వాసనఁగొను |
| 11 | 1 | జూపియు | జూపిమొ |
| | 8 | మ్మేరువుగాదుకాదిది | మ్మేరునఁగాదునానది |
| | 10 | మమభూరి | భూరిసుమ |

| | | | |
|---|---|---|---|
| | 12 | ఁగేరి | రీతి |
| | | యిత్తరి | యత్తతి |
| | 13 | యొక్కటీ | యొక్కటే |
| | 16 | డలమబాగ | డలరులాగె |
| | 19 | దశ్రు | దస్ర |
| | 21 | దుత్కంఠికా | దుత్కలికా |
| | 24 | యొకర్తుమించు | నొకర్తునించె |
| | 28 | వెస్నెల | వెన్నెలు |
| 12 | 7 | సరసంపుక | సవరంపుఁగు |
| | 14 | శక్రేశ్వర | జక్రేశ్వర |
| | 22 | యదెయిడె | యదివోది |
| | 23 | బిట్టు | బెట్టు |
| | 25 | మపుడుబడిమి | మప్పుడుబడి |
| | 2[illegible] | మెలగునేయిట్టిభయమంచు | దొలగునిట్టిభయమ్మంచు |
| 13 | 1 | బట్టెఁబాణి | బట్టుపాణి |
| | 8 | విాద | లెల్ల |
| | 11 | విడచి | బిడిచి |
| | 13 | కేరి | కెంపు |
| | [illegible]0 | టనటిలే | టనటులు |
| 14 | 18 | కోరకంబుల | కోటరంబుల |
| 15 | 4 | జతల్గూడ | జతల్గూడు |
| | 5 | పూరిగ | పూర్తిగ |
| | 8 | పొంచు | ప్రొద్దు |
| | 12 | సంచీఁచి | సంకించి |
| | 13 | అడుమాటల | పడమాటలు |
| | | గూడద | బ్రోడల |
| | 14 | బడుచు | వడచు |

| | | | |
|---|---|---|---|
| 15 | 14 | పీఠించి | నీఠించి |
| | 16 | జెలరేగి | జెలగిరి |
| | 19 | చేడియకోపము | చేడెకోపమూ |
| | | ఖామా | బారా |
| | 20 | తాళము | తాళుము |
| | 21 | వేడ్క-జని | పెక్కు-డని |
| | 22 | మైకొని | మైకొను |
| | 23 | మాటల | మాటలు |
| | | వాటపు | చోటను |
| | 24 | దను | నను |
| | 25 | గోరానిన | గంజానన |
| | | చలి | సకి |
| | 27 | రక్కసి | రక్కస |
| | | మృష | మిష |
| | 28 | యోడెనన | యోడినను |
| | | తాపపుటుబ్బకు | దాపంబుబ్బకు |
| | | గలిచెద | గొల్చెద |
| 16 | 1 | పగిడి | పగటి |
| | 2 | యేలకు | నేలకు |
| | 3 | మొగంబున | మొగంబును |
| | 8 | నెరవట్లమిగులంగనుప్పు | నెరవట్టికొనగదాయుప్పు |
| | 10 | విలయ | వలయ |
| | | పాన్త | పాంథ |
| | 11 | కణాకుమాదిలగత్రు | కణాత్కుమారిలకాహ్వా |
| | 12 | త్ఫాల | ఖ్గాల |
| | | తల్పంకేళ | పల్పంకేజ |
| | 13 | ట్వక్యాందేహా | టక్యాదేహా |

| | | | |
|---|---|---|---|
| 16 | 18 | దుర్ఘట | దుర్ఘట |
| | | పద్యాప్త | పద్యాప్తి |
| 17 | 3 | సర | చర |
| | 4 | తల | తరి |
| | 6 | తానాడంగనం దొక్క | తారాడంగసంకించు |
| | 8 | నాస్యములకు | నాబ్జములకు |
| | 9 | బొప్ప | బొప్ప |
| | 10 | కమనీయ | చందనా |
| | | కంబ | కంద |
| | | కుండ | కుంత |
| | 13 | సీతా | సితా |
| | 14 | ద్వీప | దీప |
| | 15 | దకీ్క | దక్కి |
| | 18 | తోడ | దోడి |
| 18 | 2 | జయింప | రచింప |
| | | బెద్ద | పేక్ష |
| | 3 | హాత | హిత |
| | | శ్రుతవిపక్ష | శ్రుతివివక్ష |
| | | బయతోచి | బయితోఁచ |
| | 4 | దారతాఘన | సారసారఘు |
| | 5 | వా | వ్రా |
| | 7 | ప్పలుకుం | ప్పలుకుల్ |
| | | యు | నె |
| | 9 | లాడాడతు | లాడాడను |
| | 11 | శుభదా | సుభగా |
| | 20 | జెల | జెలుల |
| | 24 | పద్ధత | పద్ధతి |

| | | | |
|---|---|---|---|
| 19 | 2 | డుండిటి | డంటిక |
| | 13 | శాలి | శాఖ |
| | 17 | దమ | దగు |
| | 19 | దాల్చి | రాల్చి |
| 20 | 4 | హుుంకువేదిక | హుంకువేడి |
| | 7 | తత్సహ | తత్సహజ |
| | 10 | హెన | హీన |
| | 12 | సహ | స్వహ |
| | 17 | నిరర్థీకార | నిరంధ్రీకార |
| | 20 | అదియు | అదియొ |
| | 25 | జలంథ | బంధురత |
| | | సూలంబు | శూలంబు |
| | 26 | పది | బది |
| 21 | 5 | నాత | దాత |
| | 8 | నేమి ప్రతియొ | నవిప్రతియొ |
| 22 | 8 | శుఖ | శుక |
| | 11 | ముద్దు | నుద్దు |
| | 19 | గూచినక | చూచినక |
| 23 | 21 | నువ్న | నున్న |
| 24 | 1 | చూడాముమణి | చూడామణి |
| | 18 | బ్రనవాఖ్యం | బ్రనవాఖ్యం |
| | 22 | అంత | అంత |
| 25 | 3 | భావ | భావ |
| | 7 | స్ఛభకాము | చ్ఛభక్రము |
| | 9 | వాగూర | వాగ్దూర |
| | 15 | తించి | స్తుతించి |
| | 19 | శమాటచేక | మాటచే |

| | | | |
|---|---|---|---|
| 25 | 21 | వలవీ | వల్లవీ |
| 26 | 10 | నెన్నెలన్ | వెన్నెలన్ |
| | 16 | ఘగ | ఖగ |
| 27 | 4 | హాల్ | హాళుల్ |
| | 16 | తెచ్చు | తెచ్చి |
| | | నినారత | నిష్ఠురత |
| | 18 | యొాడించుకో | యొడ్డించుకో |
| 28 | 18 | సంబుధినిన్ | సంబుధిన్ |
| 29 | 21 | మ్మ్రనముం | మ్మ్రనమున |
| 30 | 6 | కందులే | కద్దు వే |
| | 7 | దోకట్టి | ఓకట్టి |
| | | దాన | గాన |
| | | ఝోగికిన్ | జోగికిన్ |
| | 19 | పక్షోజ | వక్షోజ |
| | 21 | కాండా | కాండా |
| | | సీకు | సీకు |
| 32 | 4 | నందావహ | నందావహా |
| | 8 | గుుందనవు | గుందనవు |
| | 12 | దర్భ | గర్జ |
| | 16 | మథి | మది |
| 34 | 14 | దప్పు | నువ్వు |
| | 19 | బహిః | బహు |
| | 20 | పుంజముల్ | కుంజముల్ |
| 36 | 5 | వేమరో | లేమరో |
| | 12 | గోకోయన్ | గోకోయన్ |
| | 18 | బూధర | భూధర |
| 37 | 9 | లాన | గ్లాన |

| | | | |
|---|---|---|---|
| 37 | 15 | మూనదండ | మూరదండ |
| 38 | 7 | యిటమ్మ | యిట్లమ్మ |
| | 10 | నీకనుగాయకే | నీకనుగానకే |
| | 11 | జూప | సైప |
| | 14 | దానికి | థాటికి |
| | 22 | చంపకార్గళనూన | చంపకాగమసూన |
| 39 | 4 | శోచిత | శోషిత |
| | 21 | మహా | మహీ |
| | 22 | పదగ | పతక |
| 41 | 4 | రింగున | రింగస |
| | 9 | దాకున | దారస |
| 42 | 16 | గుమ్మ | గ్రుమ్మ |
| 43 | 28 | గన్నుంగద | గన్నుంగవ |
| 45 | 13 | కేరతె | కెరతె |
| | 16 | గృళ్ణుం | గృణ్ముం |
| 47 | 9 | లతాంగులు | లతాంగులు |



# అభినవ సరస్వతి.

ఇది విశేషించి తెలుఁగు కావ్యములును యతిఛందస్సంస్కృత విషయములును బ్రచురించుచుండుట కభినవముగ నేర్పడిన యొక మాసపత్రిక. ఇందు నేతత్పూర్వోక్త విషయములే కాక విశ్వబ్రాహ్మణులమని బయలుదేరిన కంసాలుల పూర్వపక్షాంశములు గూడఁ బ్రకృత మొక్కింత ప్రచురింప బడుచుండును. చందాదారులకు సంవత్సరము పుస్తకముమీఁద 4-5 మంచి యపూర్వగ్రంథము లలవడును. కావున నిది యగ్రవర్ణాభిమానులకు నాంధ్రభాషాభిమానులకు నవశ్యమాదరణీయము. చందా సంవత్సరమునకు రు 2-0-0

ఈ కార్యస్థానమున వెలకు దొరకు పుస్తకములు.

1. అళ్లయాచార్య విజయము . . . 0—4—0
2. కరిశికోద్ధారిణి. (పూరెళ్ల వీరభద్రకవి) .. 0—4—0
3. వాసంతికా పరిణయము } ఇవి 2 నాటకములు. 0—4—0
4. [illegible]నవధము, 0 - -
5. చమత్కారమంజరి. (సంపత్క్రి వెంకటాచార్యులు) 0 —
6. గురుపరంపర. . 0 —
7. నీతిగీతులు. (సుమతిశతకమునకు సంస్కృతము.) 0—2—0
8. పద్య నీతిశతకము. (కొండముది నరసింహాము) 0—1—6
9. విశ్వబ్రాహ్మణ శబ్దఖండనము. .. 0—1—6
10. ఆత్మస్తుతి విమర్శనము. (మ॥ కృష్ణద్వైపాయనాచార్యులు.) ఇది వెంకటరామకృష్ణ గ్రంథమాలపై విమర్శనము. } 0—5—0

అచ్చుపడుచున్న పుస్తకములు.

1. పల్నాటి వీరభాగవతము, 2. లక్ష్మీవిలాసము, 3. చిత్తూరిజిల్లా తీర్పువిమర్శనము.

వలయువారు ఉత్తరలు సొమ్ము పంపిగాని వి.పి.ద్వారాగాని ఈక్రింది వారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

జానపాటి పురుషోత్తమ.
సబ్ యెడిటర్, జానపాడు.

పిడుగురాళ్లపోష్టు, గుంటూరుజిల్లా.

